‘సాహితీ సిరికోన’ వాక్స్థలి దినపత్రిక నిర్వహణలో

సిరికోన ఉత్తమ కవిత-2021 గా



శ్రీమతి ఆసూరి మరింగంటి సులోచనా రంగాచార్య
స్మారక పురస్కార విజేత కావ్యం

# ఏటిపాలు జ్ఞాపకం

రచన

**డా. సూరం శ్రీనివాసులు**

పురస్కార వ్యవస్థాపకులు

**శ్రీ వేణు ఆసూరి,**

గూగుల్ సంస్థ సీనియర్ సాంకేతిక నిపుణులు,
పూర్వపు BATA ఛైర్మన్, కాలిఫోర్నియా, యు.ఎస్.

# అదృశ్యాంతరం

నాకూ నీకూ మధ్య
జలపాతాలూ లేవు
జారుడుబండలూ లేవు
లోయలూ లేవు
వంతెనలూ లేవు
కానలూ లేవు
కారడవులూ లేవు
కొండలూ లేవు
కోనల కొనలూ లేవు

పక్కపక్కనే ఉంటాం
ఒకరి గుండెచప్పుడు
ఒకరికి వినిపించేలా
ఎదురెదురుగానే ఉంటాం
ఒకరి ఊరుపుసవ్వడి
మరొకరిలో ధ్వనించేలా

అయినా
కలిసి ఊసులు చెప్పుకుంటూ
అలసి ఎంతకాలమైందో!
కళ్ళముందే
కబుర్లకావిళ్ళు దించి
ఎంత కాలమైందో!

ఎడారి ఒంటెలా నేను
ఒంటరిగా తిరుగుతుంటే

వలపు తొలకరిచినుకులా
నువ్వు లాలనతో తడిపేశావు
ఎడారిగుండెలో కూడా
ఎన్నిపూలు పూచాయో
తడారని తరితీపుల చెలమలు
ఎంతలోతుగా ఊటందుకున్నాయో

నువ్వు ఉత్తాలతాళంలా
ఎత్తెత్తుగా ఎదిగిపోతుంటే
నీ నీడ పడేంతమేర
అత్తిపత్తిలా
నేను అల్లుకుపోతాను
నీడ తగిలితేనే ముడుచుకుపోయే
నీటుతనాన్ని
నిలువెల్లా అలుముకుంటాను

అనురాగానికి
అణగారని అయిదోతనాన్నీ
ఆనందానికి
అస్తమించని రసమహత్త్వాన్నీ
నీ కరస్పర్శ
ధ్రువీకరించి సంతకం చేసింది
నువ్వు
కనుపాపవై కనికరించినా చాలు
నేను
ధ్రువతారనై జగత్తునంతా శాసిస్తాను

- డా. సూరం శ్రీనివాసులు



# Etivaalu Jnaapakam

Telugu Poetry

Dr. Suram Srinivasulu

అటు ప్రౌఢంగా, లోతుగా ఉంటూనే, ఇటు ఏ అస్పష్టతా లేని సరళ సుందరత...

అదీ ప్రయోగాల పేరిట, రాస్తున్నవారికే తప్ప చదువుతున్న వారికి

ఓ పట్టాన అర్థం కాని మాటల గారడీనే కవిత్వం అనుకొనే ఈ రోజుల్లో,

ఈ 'ఏటివాలు జ్ఞాపకం' ఒక చలివేందర లాంటిదంటే అతిశయోక్తి కాదు...

ఈ మాటకు ఇందులోని ప్రతి కవితా,

దానికి మకుటాయమానంగా నిలిచే ప్రతి ముగింపు సందేశం ఒక సాక్ష్యమే.

\- వేణు ఆసూరి

'సాహితీ సిరికోన' వాక్స్థలి దినపత్రిక నిర్వహణలో

సిరికోన ఉత్తమ కవిత-2021గా

శ్రీమతి ఆసూరి మరింగంటి సులోచనా రంగాచార్య

స్మారక పురస్కార విజేత




Price: 150/-

# ఏటివాలు జ్ఞాపకం

డా. సూరం శ్రీనివాసులు


| | |
|---|---|
| **ప్రథమ ముద్రణ:** | ఏప్రిల్ 2022 |
| **పుటలు**: | 176 |
| **కాపీలు**: | 500 |

వెల: **₹ 150/-**

| | | |
|---|---|---|
| **ప్రతులకు**: | డా. సూరం శ్రీనివాసులు | 9440242348 |
| | విట్టుబాబు | 8555082034 |

Printed & Published by

**Jaya Bhaskara Printers & Publishers**

S3, 2nd Floor, 31 & 32, Road No.4, RKH colony

Dr. A.S.Rao Nagar, Hyderabad – 500062

Contact: 8555082034

Publication No. PST04/04

నాలుగున్నర దశాబ్దాలనుండీ

అలుపెరుగని ఛాయగా అనుసరిస్తూ

నా నిరంతర సాహిత్యశ్రమకు

చేయూత నందిస్తున్న

సహధర్మశీల

# సులోచనకు



నా సిరికోన కానుకను

కానుక చేస్తూ

**– సూరం శ్రీనివాసులు**

# లోపలి పుటల్లో...

**వేణు ఆసూరి**
సిరికోన, కాలిఫోర్నియా

## మరో మానవీయ కావ్యం 'ఏటివాలు జ్ఞాపకం' మా 'సిరికోన' కు మరో గర్వ కారణం!

**సి**రికోన మిత్రులందరి పక్షాన డా. సూరం శ్రీనివాసులు గారికి హార్దిక అభినందనలు, మనస్ఫూర్తిగా ధన్యవాదాలు! అంతటి విద్వత్కవి సిరికోన వార్షిక కవిత పోటీలలో తాను కూడా ఒక ఔత్సాహికకవిగా పాల్గొని, పురస్కార విజేతగా దీన్ని స్వీకరిస్తున్నందుకు, ఒక ఉత్తమ మానవీయ కావ్యాన్ని సిరికోనకు బహూకరిస్తున్నందుకు ఎన్ని ధన్యవాదాలు చెప్పినా చాలవు కదా!

'రలయోరభేదః' సూత్రాన్ని, 'సిలికాన్' అనే మాటకు అన్వయించి, దీనికి 'సిరికోన' అనే సార్థక నామాన్ని స్థిరపరచి, ఇక్కడి సాహిత్య ప్రియులైన మావంటివారిని, తన భారతీయ మిత్రులతో కలిసి ప్రోత్సహించడానికి 'సాహితీసిరికోన'ను వాట్సాప్ మాధ్యమంలో రూపకల్పన చేశారు, పెద్దలు ఆచార్య గంగిశెట్టి లక్ష్మీనారాయణ గారు. వారే వాట్సాప్‌కు తెలుగులో 'వాక్స్థలి' అనే నామకరణం చేశారు. అతి త్వరలో అదో చక్కటి సమగ్ర సాహిత్య అధ్యయన వాక్స్థలిగా రూపొందింది... అటు సంప్రదాయానికి, ఇటు నవ్యత్వానికి , సృజనాత్మకతకు - అధ్యయనానికి వారధిగా పురోగమించింది... సాహిత్యవ్రతులను ప్రోత్సహించడానికి వివిధ పురస్కారాలను కూడా నెలకొల్పడం జరిగింది... అందులో ప్రతియేటా వస్తున్న సిరికోన ఉత్తమ కవిత్వానికి మా తల్లిగారి పేరిట శ్రీమతి ఆసూరి మరింగంటి సులోచనా రంగాచార్య పురస్కారాన్ని నెలకొల్పే భాగ్యం, తొలి ఏడాది అడ్మిన్లలో ఒకరైన నాకు దక్కింది. ప్రతి సంవత్సరం చివర, సంక్రాంతి నుంచి దీపావళి మధ్య కాలంలో సిరికోనలో వచ్చిన అత్యుత్తమ కవిత్వానికి, పుస్తక ముద్రణతో

ముడిపడ్డ పాతికవేల రూపాయల పురస్కారం అందిస్తున్నాము. 2019లో వచ్చిన ఉత్తమ కవిత్వంగా 'నీలమోహనం' కృతికి 'మధురకవి' శ్రీ బులుసు వెంకటేశ్వర్లు గారు, 2020 లో 'ఇక్కడ ఎవరైనా ఒకటే' సంపుటికి సుప్రసిద్ధ కవయిత్రి శ్రీమతి స్వాతీశ్రీపాద గారు ఈ పురస్కారాన్ని స్వీకరించి ఈ పురస్కారానికి ఒక ప్రతిష్ఠ కలిగించారు...

ఇప్పుడు ఈ 'ఏటివాలు జ్ఞాపకం' సంపుటితో ఆ ప్రతిష్ఠను మరో రెండు మెట్లు పెంచుతున్నారు మన విద్వత్కవి డా. సూరం శ్రీనివాసులు గారు. సంస్కృతాంధ్ర ప్రాచ్యవిద్యావేత్తగా, ఉభయభాషలలో ప్రశస్తమైన కవిగా, సారమెరిగిన విద్వత్పరిశోధకులుగా, అన్నిటికీ మించి వ్యాసభారతాన్ని అత్యంత జనప్రియంగా తెలుగులో అందించిన అనువాదకులలో ఒకరుగా వారు తెలుగునాట అంతటా సుప్రసిద్ధులు. అవధానులకే అవధానకళా గురువుగా పేరున్న సూరం గారు, ఆధునిక వచనకవితా రూపంలో అటు సంప్రదాయ మహత్త్వం, ఇటు ఆధునిక అభ్యుదయ తత్త్వం రంగరించి, ఇంత సుప్రసన్నమైన సుమధుర భాషలో చక్కటి ఆదర్శవంతమైన వచనకవిత రాశారంటే నమ్మశక్యం కానంత ఆశ్చర్యంగా ఉంది....

నిజానికి వీరు కోనలో గత ఏడాది ఏప్రిల్ మాసం చివరలో కాబోలు ప్రవేశించారు. 'సిరికోన బెస్ట్ పొయెట్రీ అవార్డ్' దృష్టిలోకి రాగా, మే నెల ఆఖరులో మొదటి కవిత పెట్టారు.. మొదటి ఒకటి రెండు రోజులయ్యాక కానీ తెలియలేదు వారు పోటీలో ప్రవేశించారని! అంతవరకూ ఎంతో చక్కటి కవితారేఖలు సిరికోనలో పోటీబడి సాగుతున్నాయి... ఆ తర్వాత, అవి క్రమంగా వీరి కవితల ముందు చిన్న గీతలుగా మారిపోయాయి.. వారు కూడా అవశ్యం గ్రహించి, నేర్చుకోవలసినంత నిర్దిష్టంగా సాగాయి వీరి కవితా ప్రమాణాలు.

వీరి కవితాప్రమాణాల గురించి విపులంగా చర్చించేటంత విద్వత్తు నాకు లేదు... కానీ భాష విషయంలోనూ, అందులో అతి సహజంగా దొర్లిపోయే లయమాధురి, పొందిక విషయంలోనూ, అతి జటిలమైన భావాన్ని

కూడా బహు సున్నితంగా, కడు తేలికగా చెప్పే తీరులోనూ వారు చూపే 'ఒడుపు', ఏ వర్గం పాఠకుణ్ణయినా వెంటనే ఆకట్టుకొంటుంది. తనలో ఇముడ్చుకొని తనతో పాటు తీసుకువెళ్తుంది.... చివరకు ప్రతివారూ కేలు మోడ్చే మానవతాభావసముద్ర తీరంలోకి చేర్చి, ఆ అలల ఒడ్డులో తనలోకి తాను చూసుకొనేలా చేస్తుంది.. కవి చెప్పిన ప్రతిశబ్దం తన గుండెచప్పుడే అనిపించేలా చేస్తుంది... ఒక మంచి కవిత సార్థక్యం, అలాటి మానవీయ ఆత్మీయస్పందనలో ఉంది... మనలో నిద్రాణమై ఉన్న మానవీయ శబ్దాన్ని మేల్కొల్పడంలో ఉంది... అది మేల్కోవాలంటే ఒక సుప్రభాత శ్రావ్యగీతం వినిపించినట్లుగా కవిత సరళ సుందరంగా కదలి రావాలి..

సూరం గారి కవితల్లో నాకు అర్థమైనంతవరకు, నన్ను ఆకట్టుకొన్న ప్రధాన లక్షణం అదే!.. అటు ప్రౌఢంగా, లోతుగా ఉంటూనే, ఇటు ఏ అస్పష్టతా లేని సరళ సుందరత... అదీ ప్రయోగాల పేరిట, రాస్తున్నవారికే తప్ప చదువుతున్న వారికి ఓ పట్టాన అర్థం కాని మాటల గారడీనే కవిత్వం అనుకొనే ఈ రోజుల్లో, ఈ 'ఏటివాలు జ్ఞాపకం' ఒక చలివేందర లాటిదంటే అతిశయోక్తి కాదు... ఈ మాటకు ఇందులోని ప్రతి కవితా, దానికి మకుటాయమానంగా నిలిచే ప్రతి ముగింపు సందేశం ఒక సాక్ష్యమే. వాటిని ఇక్కడ ఉదాహరిస్తూ, పుటల సంఖ్య పెంచడం భావ్యం కాదు.

"కథ నిన్నటిదైనా
ముగింపు నేటిది కావాలి" – నేటిదే కాదు, రేపటిదే కాదు, ఏ నాటి కైనా ఇది ముగింపులేని 'ఏటివాలు జ్ఞాపకం', మానవీయ ప్రవాహం! మీరే లోనికి వెళ్లి చూడండి.. లోతు తెలుస్తుంది!!

- వేణు ఆసూరి

**ఆచార్య రాచపాళెం చంద్రశేఖర రెడ్డి**

విశ్రాంత అధ్యాపకులు
7వక్రాస్. భైరవ నగర్,
జె ఎన్ టి యు వెనుక, అనంతపురం.515002
✆ 94402 22117

## సనాతన ఆధునాతన భావాల సంగమం

**ను***వ్వూ నేనూ*
*ఒకే జీవుడి రెండుముక్కలం*
*అందుకే*
*నా చూపులతో నేనేం వ్రాసినా*
*నీకు కరతలామలకమే అవుతుందది.*
*నువ్వెలా భాష్యాన్ని అనుగ్రహించినా*
*నాకు అంతకన్నా ఏముందనిపిస్తుంది..*

(ఏటివాలు జ్ఞాపకం: పు.123)

డా. సూరం శ్రీనివాసులు గారు నాలాగే విశ్రాంత సాహిత్య అధ్యాపకులు. నాకన్నా రెండున్నరేళ్లు చిన్నవారు. వారి విద్య, ఉద్యోగం, అధ్యయనం అంతా ఓరియంటల్ వ్యవస్థలో సాగింది. సంస్కృత, ప్రాచీన తెలుగు సాహిత్యాలలో లోతులు చూశారు. వారు కవి, వ్యాఖ్యాత, అనువాదకులు, విమర్శకులు. సంప్రదాయ ప్రభావం గల శ్రీనివాసులు గారు ఆధునికతకు వ్యతిరేకులు కారు.

ఆయన ఇదివరకే ‘సౌమనస్యము’ అనే పద్య కావ్యం, ‘సున్నితపు త్రాసు’ ‘స్థావరజంగమం’ అనే వచన కావ్యాలు ప్రచురించారు. ఇప్పుడు ‘ఏటి వాలు జ్ఞాపకం’ కావ్యం తీసుకొచ్చారు. ఈ కావ్య ప్రచురణ సందర్భంగా శ్రీనివాసులు గారికి శుభాకాంక్షలు.

కవికి కవిత్వతత్త్వం తెలియడం అవసరం. తెలిసో తెలియకో అది ప్రకటితమౌతూనే ఉంటుంది. శ్రీనివాసులు గారికి కవిత్వతత్త్వం బాగా తెలుసు. వచనకవిత్వం పలుచబడిపోతున్నదనే విమర్శ వస్తున్న నేపథ్యంలో శ్రీనివాసులు గారు కవిత్వం చిక్క గా ఉండాలని తపిస్తున్నారు. కవిత్వం పుట్టుకను గురించి ఆయనకు అవగాహన ఉంది.

*ఆవేశపడాలి అంతరాంతరాలు రగిలేటట్లు*
*కవిత్వమైపోవాలి మనలో ఏమీ మిగలనట్లు*
*పాలపొంగులా అణువణువూ కదలాలి*
*కదలిక లన్నీ ఒక్కటై పొంగునే పొంగించాలి* (పు.89)

కేవల ఆకారమే కవిత్వ లక్షణం కాదనీ, ఆకారం కవిత్వంగా రూపు దిద్దుకోవాలని ఆయన అభిప్రాయం. కవులు తాము ఏమౌతారో చెప్తారు గానీ, మనం ఏమి కావాలో చెప్పరని ఆయన ఫిర్యాదు. ఆయన ఫిర్యాదు సార్వత్రికం కాదు గానీ, అది స్వీకరించి తగిన ఫిర్యాదే.

*సమాజానికి తలమానికలమై*
*నాల్నాళ్లైనా బ్రతుకుదాం* (పు. 85,86)

"అనంత సృష్టిలో అణువణువూ నీదీ నాదీ" "ఉమ్మడి ఆస్తిలో మీ శ్రమ ఫలమే నీది" అనగలిగిన శ్రీనివాసులు గారు "కలివిడిగా నడుద్దాం పద" అని పిలుపునిచ్చారు. మానవ ఐక్యత ఈ కావ్యం నిండా పరచుకొని ఉన్న కవి ఆకాంక్ష.

ప్రకృతి - మనిషి సంబంధం, మనిషి - మనిషి సంబంధం పటిష్ఠంగా ఉండాలన్నది ఈ కవి కోరిక. ప్రకృతి పట్ల మనిషి స్వార్థబుద్ధితో ప్రవర్తిస్తే ప్రకృతి విధ్వంసం జరుగుతుంది. మనిషి పట్ల మనిషి విపరీతంగా ప్రవర్తిస్తే సమాజ విధ్వంసం జరుగుతుంది. అందువల్ల ఈ ద్వంద్వాల మధ్య సమతుల్యత, సామరస్యం అవసరమంటారు. మనుషులలో ద్వంద్వ ప్రవృత్తి ఉండడం ఈ కవి అధిక్షేపానికి గురైంది. గొప్ప వ్యక్తులు ఎలా ఉంటారో ఈ కవి చెప్పారు.

*మహానుభావులు ఎక్కడో ఉండరు*
*మనమధ్యనూ*
*మనచుట్టూ*
*మనలోనూ*
*మన పరిసరాలలో*
*మన మనఃకుహరాల్లో*
*అజ్ఞాతవాసంలోనూ*
*ఆనందంగానే ఉంటారు* (పుట. 50)

కవికి మానవ వికాస చరిత్ర తెలిసుండడం అవసరం. శ్రీనివాసులు గారికి అది బాగా తెలుసు. "ఏమో... ఏం జరిగిందో!" ఇందుకు సాక్ష్యం (పు.63). దోపిడీని సామాజిక కవులెవరూ సహించరు. పంచభూతాలను బీటలు వారించే ఆధిపత్య, అహంకార వాదం మీద కవి తీవ్రంగా ఆగ్రహించారు.

చరిత్ర పురోగమనశీలం మీద ఈ కవికి పూర్తిగా విశ్వాసముంది. "విధిగా అది ముందుకే సాగుతుంది" (పు.91) అంటారు శ్రీనివాసులు గారు. మనుషులు శపలాలుగా మారుతున్న సమయంలో కవి "నలుగురు ఒక్కటై" పోవాలంటున్నారు (పు.124)

*నలుగురూ ఒక్కటై నడిస్తేనే...*
*ఒక క్షణం*
*బ్రతుకు దుర్భర మనిపించినా*
*మరో క్షణం*
*నందనవనంలా కనిపించేది* (పు. 125)

ప్రజాస్వామ్యం రూపంలో నిరంకుశత్వం వస్తువైపోవడం ఇప్పటి వైరుధ్యం. దీని ఫలితం స్వేచ్ఛారాహిత్యం. జనంలో రకరకాల భయాల్ని పాదుకొల్పడం. ఈ స్వేచ్ఛాహత్యను ఈ కవి నిరసిస్తున్నారు.

*వేకువగాలి*
*చల్లగా తట్టి లేపుతున్నా*
*పులకరించాలన్నా భయం*
*సూర్యకిరణాలు కనురెప్పలను తాకితే*
*కన్ను మూసుకోవాలన్నా భయమే* (పు. 139)

ఇలాంటి అభివ్యక్తులలోనే కవి ఎంత వర్తమానంలో ఉన్నాడో తెలిసేది. "నా రెక్కలు విరిగి తరాలు గడిచిపోయాయి" అనడం హింసాచరిత్రను గుర్తు చేయడమే. "విధి ఎప్పుడూ వక్రిస్తూనే ఉంటుంది" అనడం సంప్రదాయ దృష్టి అనిపించినా

*తరతరాలుగా నేను*
*వీడికో వాడికో బానిసనే*
*బానిసల అడుగుజాడల్లోనే*
*పాదాలు కదుపుతూ నడిచినవాణ్ణి* (పు. 140)

అనడం సమాజం పట్ల గల వాస్తవిక దృష్టికి నిదర్శనం.

శ్రీనివాసులు గారు ఒక వస్తువును తీసుకొని, దానికి గల సాంస్కృతిక, చారిత్రక భూమికను వివరించడంలో నేర్పరి. 'రాదారి పడవ' (పు.36) ఇందుకు మరో ఉదాహరణ. నీళ్లలో తిరిగే పడవ నిర్వహించే పాత్రను ఇందులో ఆసక్తికరంగా వర్ణించారు.

*నీటితోటల్లోనే సంచారాలైనా*
*నీ వెరుగని తీరాలు లేవు* (పు. 37)

ప్రకృతిని శ్రీనివాసులు గారు కేవలం కొన్ని వస్తువుల సముదాయంగా చూడరు. చరిత్రకు వేదికగా చూస్తారు. ప్రకృతిలోని వైవిధ్యాన్నీ, వైరుధ్యాన్నీ గుర్తించి కవిత్వీకరిస్తారు. 'ఎంతలా ఎదిగాడో' (పు.68) కవిత చదవాలి. మనిషీ మృగాల మధ్య గల భేద సాదృశ్యాలను ఆలోచనాత్మకంగా చెప్పారు. ఒకే అవసరాన్ని రెండు ప్రాణులు రెండు రకాలుగా తీర్చుకోవడం ఈ కవితలో చూడగలం. అలాగే 'రెండూ ఒక్కటైతే' (పు.128) కవితలో ఒకే దృశ్యాన్ని ఇద్దరు ఎలా చూస్తారో చెప్పారు. దృష్టి వైవిధ్యానికి ఈ కవిత అక్షర రూపం.

*ఎర్రకళ్ళ సూర్యుడిలో*
*ఏడంచుల కాంతివలయాలు నీ భావనం*
*నిద్రాణమైన జనజాగృతికై*
*నిరంతరం జరిగే తపస్సు నా దర్శనం* (పు.128)

ఈ దృష్టి భేదం చెప్పి, ఈ రెండు దృష్టులూ ఏకం కావాలని కవి కోరుకుంటారు.

పౌరాణిక జ్ఞానం పుష్కలంగా గల శ్రీనివాసులు గారు ఆ జ్ఞానాన్నంతా తన కవిత్వంలోకి ఒంపారు. జరాసంధుడు, శ్రీకృష్ణుడు, విశ్వామిత్రుడు, కుంతి మొదలైన పురాణ పాత్రలను సామాజిక సందర్భాలకూ, స్వభావ రీతులకూ ప్రతీకలుగా చిత్రించారు. 'జీన్సు' అనే భావనను తీసుకొని 'మనిషి – నిలువుకోత' కవిత రాశారు (పు.98). 'ఏ పుట్టలో ఏ పాముందో' కవిత (పు.101)

సృష్టికి ఒక కర్త ఉన్నాడన్న నమ్మకం ఈ కవికుంది. అందుకే ప్రకృతిలోని ఝరి, కరి, దరి, లత, కత, భాష వంటివి

*అన్నీ ఆ దేవుడు చిక్కుకున్న*
*సుస్నిగ్ధ సుందర శిల్పాలే* (పు.108)

అని నిర్వచించారు. అయితే ఆ సృష్టిని మనిషి దుర్వినియోగం చేయడం మీద కవి ఆగ్రహించారు.

*అంతస్సూత్రం అవగాహనకొస్తేనే*
*అవతారతత్త్వ మైనా అర్థమయ్యేది* (పు. 1)

అన్న చింతన గల శ్రీనివాసులు గారు సనాతన, అధునాతన భావాల సంగమ కవి. ఆయన పూర్తిగా భౌతిక, మానవవాదిగా మారడాన్ని చూడాలని నేను ఎదురు చూస్తూంటాను.

*నీలాగే నాదీ గుప్పెడు గుండెతో శ్వాస*
*నీలాగే నేనూ భవిష్యత్తు మీద ఆశ* (పు.12)

అనంతపురం
06.04.2022

[signature]

**డా|| బీరం సుందర రావు**
రిటైర్డ్ తెలుగు లెక్చరర్, కవి
306, సదానంద రావు రెసిడెన్సీ
చీరాల - 523155, ✆9848039070

## ఏటివాలు జ్ఞాపకాల తేట నీటి రుచి

*"ఈ కవులెప్పుడూ ఇంతే*
*తామే మవుతారో చెప్తారే కానీ*
*మనమేం కావాలో చెప్పరు*
*పువ్వు నవుతానని ఒకడు*
*పెదాలపై నవ్వు నవుతానని ఒకడు*
*కవిత్వ మవుతానని ఒకడు*
*కాలక్షేప మవుతానని ఒకడు*
*అంటారే గాని -*
*మీ ఆకలికి*
*అన్నమవుతానని ఒక్కరూ అనరేం?*
*మీ హృదయానికి*
*కవచమవుతానని ఎవ్వరూ పలకరేం?"*

- అని ప్రజల పక్షాన నిలబడి ప్రశ్నిస్తున్న కవి డాక్టర్ సూరం శ్రీనివాసులు గారు. "కవిత్వం కవిత్వం కోసం" అన్న పాతకాలపు నినాదానికి పాతరేసి, "కవిత్వం సమాజం కోసం" - అనే నూతన పల్లవికి కవులు గొంతుకలిపి చాలాకాలమవుతున్నా, చాలామంది కవులు పాత గీత దాటి బయటకు రాలేకపోతున్నారు. తాము రాస్తుంది ఎవరి కోసమో, ఎందుకోసమో స్పష్టంగా చెప్పలేకపోతున్నారు. ఈ అయోమయానికి, అస్పష్టవైఖరికి తెరదించుతూ "కవులు ప్రజల పక్షాన నిలబడాలి. నినదించాలి. నిర్భయ స్వరాన్ని వినిపించాలి"

- అని నిర్ద్వంద్వంగా చెబుతున్న డా॥ సూరం వారి కలాన్ని, గళాన్ని మనం నిండు మనసుతో స్వాగతించాలి.

డా॥ సూరం శ్రీనివాసులు గారు జగమెరిగిన పండితులు. అవధాన రంగంలో ఆరితేరారు. ఆధ్యాత్మిక ప్రవచనంలో అంచులను చేరారు. అధ్యాపకునిగా శిష్యుల గుండెల్లో కొలువు తీరారు. ప్రాచార్యులుగా ప్రశంసలు పొందారు. భుజకీర్తులకు, ముఖస్తుతులకు ఇష్టపడని విలక్షణ వ్యక్తిత్వం వారి సొంతం. ముక్కుసూటిదనం వారి మనస్తత్వం. భాష యొక్క ఆనుపానులు తెలిసిన వ్యాకరణవేత్త. కావ్య పరామర్శలో కాకలు తీరిన కలం యోధులు వారు.

సూరంవారితో బీరంవారి అనుబంధానిది మూడు పదుల వయసు. మా ఇంకొల్లు సమీపంలోని తిమ్మసముద్రంలో ఎన్నో భాషా సముద్రాలను సృష్టించిన అధ్యాపకత్వం వారిది. పాఠం చెప్పడమంటే ప్రతిపదార్థ, తాత్పర్య వివరణ కాదని, విద్యార్థుల్ని భాషా, సాహిత్యాల పట్ల ఆకర్షితుల్ని చేసి, వారిని పరిపూర్ణ జ్ఞానవంతులుగా దిద్ది తీర్చడమని గుర్తించిన గురూత్తములు వారు. పద్యం, శ్లోకం, వ్యాకరణం, అలంకారం ఏది చెప్పినా వారిదో ప్రత్యేక శైలి. వారి వ్యవహార శైలి కూడా సూత్రబద్ధంగానే వుంటుంది. మాటలు మితంగా, హితంగా, పరిమితంగా ఉంటాయి. ఒక్క మాటలో - సూరంవారు "సున్నితపు త్రాసు" లాంటివారు.

గతంలో "సున్నితపు త్రాసు"తో తమ కవిత్వాన్ని తూచుకున్న వారు, ఇపుడు "ఏటివాలు జ్ఞాపకం"తో మనల్ని పలకరిస్తున్నారు. బాల్యం నుండి ఏటికి ఎదురీదిన సూరం వారు, తమ జీవితానుభవాలను సుదీర్ఘ సామాజికానుభవంతో రంగరించి, ఏటివాలు జ్ఞాపకాలుగా మన ముందు కుప్పలు పోశారు.

*"మాటలో పాటలో బాసలో యాసలో*
*పదంలో కదంలో కంటిలో మంటిలో*
*నలుగురూ ఒక్కటిగా నవ్వుకునే చోటులో*
*తోటలో కోటలో చాటులో మాటులో*

*చూడగలిగే కళ్ళుండాలి కానీ*
*కాంతికణాలు కనిపించని చోటెక్కడ?" –*

కళ్ళుంటే చూసి, వాక్కుంటే రాసీ పరవశించమన్నాడు మహాకవి శ్రీశ్రీ. ప్రపంచంలో కవిత్వం కానిదేదీ లేదన్నాడు. కనుకనే శ్రీశ్రీ గారికి "ప్రపంచమొక పద్మవ్యూహం - కవిత్వమొక తీరని దాహం" - అయింది.

శ్రీశ్రీకే కాదు, శ్రీనివాసులు గారికీ కవిత్వ దాహం వుంది. అన్ని కాలాల కవుల్ని చదివి, తన దాహం తీర్చుకుని, కాలానుగుణమైన కవితాసృజనతో సూరం వారు మన దాహం తీరుస్తున్నారు. లోకం చూపుకు భిన్నమైంది కవి చూపు. మన నిత్య జీవితంలో భాగమైన మాటలో, పాటలో, వాటి మూసలో, బాసలో కవి తన వస్తువును ఏరుకుంటాడు. పదం పాడినా, కదం తొక్కినా కవి కవిత్వమై పరవశిస్తాడు. లోకంలో చాటుమాటు వ్యవహారాల్ని, దొంగ వ్యాపారాల్ని, దోపిడీల్ని, దుర్మార్గాల్నీ రచ్చ కిడ్చి, అచ్చులో ఆరబోస్తాడు. మనం చూడగలిగితే ప్రపంచమంతా కవితామయమే. ఆ కాంతి కణాలను ఏరుకునే దృష్టి, దార్శనికత వున్నవాడే కవి. స్పందించేవాడే పాఠకుడు. డా॥ సూరం శ్రీనివాసులు గారు నిబద్ధత వున్న కవి. చాలామంది భాషా పండితుల్లో కన్పించే ఛాదస్తం, ఆచరణ సాధ్యం కాని భాషా వ్యామోహం వారిలో మచ్చుకైనా కన్పించదు. వారి ముక్కుసూటి తనంతో చాలామంది ఏకీభవించరు. అయినా సూరంవారు రాజీపడరు. అది క్లాసురూమయినా, సభావేదికైనా తమ అభిప్రాయాన్ని నిర్మొహమాటంగా చెప్పడం వారి జీవన శైలి.

*"ముడిచిన వ్రేళ్ళే జీవితమైతే*
*లోపలంతా చీకటే*
*వ్రేళ్ళు విశ్వం వైపు సాగితే*
*వెలుగు కరతలామలకమే"*

- అంటారు సూరంవారు. చీకటి నుండి వెలుగు దారి చూపే వాడు కవి. కొత్త వేకువల్ని దానం చేసేవాడు; ప్రపంచమంతా నిద్రపోయేటపుడు సరిహద్దు

సైనికుడిలా మేలుకునేవాడు కవి. ఈ సత్యాన్నే కవితాత్మకంగా చెప్పారు సూరంవారు. కవి ఆశావాది. కవిత్వం దారి దీపం.

*"మోడువారిన మ్రానులే*
*మరునాటికి చిగురించేది*
*నెఱ్ఱులు వారిన నేలలే*
*వెన్నముద్దలై ప్రసవించేది"*

- మోడు నుండి చిగురు వచ్చినట్లే, నిన్న నుండి నేడు, నేటి నుండి రేపు ప్రభవిస్తుంది. భవిష్యత్తును కాంతివంతం చేసేదే కవిత్వం. ఈ సంపుటిలోని చాలా కవితల్లో ఆశావాదం, మానవతావాదం జమిలిగా కలిసిన సరికొత్త సామాజికవాదం మనల్ని చదివింపచేస్తుంది. ఆలోచింపచేస్తుంది.

*"ఉపనిషత్తుల తలమీద కొట్టినమేకుకన్నా*
*నీ కాలికి తగిలిన ఎదురు దెబ్బ గొప్పదా?"*

- అని ప్రశ్నిస్తారు. ప్రశ్నలోని ఆంతర్యం మన అంతరంగాన్ని తట్టి లేపుతుంది.

*"పుట్టి పదికాలాలైనా*
*పట్టెమంచంలా పడుంటే*
*పీర్లు గుండానపడే వేళకైనా*
*సమాజానికి ఒక జ్ఞాపకమై*
*ఎలా మిగలగలం?"*

- అంటూ ఈ జీవిత సత్యాన్ని ఆవిష్కరింపచేస్తారు.

*"పదిమందికోసమే కంకి*
*పాలుపోసుకుంటుంది కాబట్టి*
*అందుకే*
*ధాన్యవాచకాలకు ఏకవచనం లేదు*
*గింజలన్నీ ఒక్కటై ఎవరో ఒకరి ఆకలి తీరుస్తాయి*
*సస్యవాచకాలకు బహువచనం లేదు"*

- అంటూ సూరం వారు ఓ నిత్యసత్యాన్ని తమ వచనంలో నిత్య బహువచనంగా చమత్కరించారు. సస్యమైనా, ధాన్యమైనా గౌరవ వాచకాలే! రైతు శ్రమ జీవనఫలాలే! ఆకలి తీర్చే రెండూ పరోపకారాలే!

*"తెరతీసేదాకానే నాటకకళాపరిషత్తు*
*తెరతీయగానే పరిషత్ రాజకీయాలే"*

- వర్తమాన కళాపరిషత్తుల డొల్లతనాన్ని, 'నందుల' చుట్టూ తిరిగే నందికేశ్వరుల కళాసేవను వ్యంగ్యంగా వ్యాఖ్యానించడం సూరంవారి కలానికే సాధ్యం. సంస్కృత ప్రహసనాల మీద పరిశోధన చేసిన సూరంవారికి ఏది ప్రహసనమో బాగా తెలుసు.

*"నడక సరిగా ఉంటే పరమాత్మ ప్రకాశించినట్టే*
*నడత సరిగా సాగితే జీవాత్మ జిగేలుమన్నట్టే"*

- నడక, నడత రెండు మనిషికి సంబంధించినవే! రెంటిలో ఏది గొప్పదంటే జీవాత్మ, పరమాత్మలకు వాటిని సమన్వయంచి చెప్పడంలో సూరంవారి గడుసుదనాన్ని మనం గమనించవచ్చు. వారే అంటారు మరోచోట-

*"జీవాత్మలమైతే జనంతో కలిసి బ్రతుకుదాం*
*పరమాత్మలమైతే జగతిలో నిలిచి పలుకుదాం*
*రెండూ మనమే అయితే*
*జనాన్ని జగత్తునూ ముడివేస్తూ మురిపిద్దాం"*

- అంటూ చక్కని ముక్తాయింపునిస్తారు. సృష్ట్యాది నుండి జీవాత్మ, పరమాత్మల మధ్య కీచులాట కొనసాగుతూనే వుంది. తత్త్వవేత్తలు తవ్వుతూనే ఉన్నారు. చిక్కుముడి అర్థం కాక సామాన్యుడు సణుగుతునే వున్నాడు. న్యాయస్థానంలో న్యాయమూర్తిలా సూరంవారు చక్కటి తీర్పునిచ్చారు

*"అద్వైతభావనతో ఆకలి తీరదు*
*ద్వైతం తలకెక్కినా దప్పిక తీరదు"* - అంటారు.

ఇలాంటి పాదాలు వేదాలై, హృదయ నాదాలై మనల్ని పలకరిస్తాయి. మనలోని తాత్వికతను నిద్ర లేపుతాయి.

కవిత్వంలో రూప సౌందర్యం గొప్పదా? భావ సౌందర్యం గొప్పదా? అంటే రెండూ కలిస్తేనే కవిత్వమన్న సత్యాన్ని సూరంవారు తమ కవితల్లో ప్రకటించారు. "మాలిమి మనపాట", "అంధకారానికి అటూ ఇటూ", "మనుగడ", "ఏటివాలు జ్ఞాపకం", "పసుపుకొమ్ము", "అనాద్వైతం", "మాట", "ఒక్కొక్కసారి అంతే!", "మనిషి - నిలువుకోత", "దేవుడు చెక్కిన శిల్పాలు" వంటి కవితలు మనతో కరచాలనం చేస్తాయి. ఆత్మీయంగా కౌగలించుకుని, అక్షరానుభూతిని అంతరంగంలో ఆవిష్కరిస్తాయి.

కవిత్వం అనుభూతుల తేనెతుట్టె. దాన్ని జాగ్రత్తగా కదిపి తేనెను జుర్రుకోవాలి. అనంతరం రుచి మాధుర్యాన్ని నెమరువేసుకోవాలి. నాగలి మట్టి పొరల్ని చీల్చినట్లు, కవిత్వం గుండె పొరల్ని చీల్చాలి. కవిత్వం మనిషిని, మనసును తడపాలి. పొగమంచుల చుట్టూ ఆవరించాలి. సూరంవారి మాటల్లోనే -

*"కవిత మనస్సులో మహోన్నత శిఖరమే*
*ఎన్నెన్ని ఇంద్రధనుస్సులో, మెరుపులో"*

- వేల మెరుపుల కాంతి కిరణాలు, అక్షరాల హరివిల్లులు ఈ పుస్తకంనిండా వున్నాయి. "జనాద్వైతం" కవితలో సూరంవారి తాత్త్వికదృక్పథం హిమశిఖరంలా దర్శనమిస్తుంది. "రేపటి బాసలు" కవిత చదువుతుంటే తిలక్ శైలి కన్పిస్తుంది.

*"శుక్తిలో పడి బ్రతకకపోతే*
*చినుకు ముత్యమెలా అవుతుంది?*
*మమతలో పడి నలగకపోతే*
*మనసు మాలిమి ఎలా అవుతుంది?"*

- పంక్తులు చూచినప్పుడు మా గురువుగారు డా॥ నాగభైరవ గారు గుర్తొస్తారు. విశ్వకవి రవీంద్రుడు కోరుకున్న మానవత్వాన్ని, మనిషితనాన్ని సూరంవారూ కాంక్షించారు. నిష్పాక్షిక దృష్టితో చూసినపుడు "ఏటివాలు జ్ఞాపకం"లో మనల్ని తట్టిలేపే కవితలు చాలా ఉన్నాయి.

పండితులైన సూరం వారు పద్యం రాస్తే లగువూ, బిగువూ ఉంటుంది గాని, వచన కవిత రాయడమేమిటని? ఎవరైనా అడిగితే - నిండుగా ప్రవహించే నది ఎన్ని మలుపులు తిరిగినా అందమే నన్నది నా సమాధానం. పద్యంలో ఛందస్సు రూపానుభూతినిస్తే, వచన కవితలో అభివ్యక్తి సాంద్రత రసానుభూతి నిస్తుంది. భావానికి మించిన భాషను వచనకవిత భరించలేదు. "కవిత్వం మీద పాండిత్యం బరువు పడితే అప్పచ్చిలా అరిగిపోతుందం"టారు నార్ల వారు. వాక్యాన్ని ఎలా కవిత్వం చేయాలో సూరంవారికి బాగా తెలుసు. అయితే వచన కవిత అనవసర కొనసాగింపును సహించదు. భావపరిపూర్ణత వచనకవితకు ముఖ్యం. "పృథివీ నిత్యయౌవనా" కవిత భావౌన్నత్యంతో వాక్యం తర్వాత వాక్యం ఉత్కంఠగా సాగుతూ మనల్ని తన వెంట నడిపిస్తుంది.

డా॥ సూరం శ్రీనివాసులు గారిలో మనకు తెలియని పనితనం వుంది. అందరికీ తెలిసిన పాండితీప్రకర్ష వుంది. పాండిత్యంతో లోకాన్ని గెలిస్తే, పనితనంతో తనను తాను గెలుచుకున్నారు. దీన్నే స్వీయానందం ఉంటారు. స్వీయానందాన్నీ సామాజికానందంలో చూసే అరుదైన వ్యక్తి సూరంవారు. సూరంవారి వ్యక్తిత్వంలాగే వారి కవిత్వమూ విలక్షణమైంది. దాపరికాలుండవు. ఋజువర్తన కవికి అవసరం - చాలా కవితల్లో సూరం వారే నేరుగా మనతో మాట్లాడతారు.

*"ఆలోచన నిరంతరప్రవాహమంటూనే*
*అక్షరాల మధ్య ఆనకట్టలు కట్టేస్తోంది*
*ఇంకానయం ..కళ్ళకింకా గంతలు కట్టలేదు "*

*"పంచె పెద్దదో అంచు పెద్దదో*
*అర్థం కాకుండా బ్రతికేస్తున్నాం "*

*"కోతికి తోకంటేనే మక్కువ*
*ఇప్పటికీ మనుషులకు తోకొక్కటే తక్కువ "*

- వంటి పాదాల్లో సూరంవారి కవితలోని సున్నితత్వాన్ని, సూక్ష్మాన్ని గ్రహించి వస్తువుతో మమేకమై చదవాలి. అపుడే "ఏటివాలు జ్ఞాపకం" ఓ పరిపూర్ణ అనుభవాత్మక కవితామధువును అందిస్తుంది. శ్రీమతిని గురించి కృతజ్ఞతాభారంతో "తాను" శీర్షికన రాసిన కవిత చదివాక మనసు కరిగి ఆర్ద్రమవుతుంది. ఆత్మీయత వెల్లువలా ముంచెత్తుతుంది. అనురాగం పల్లవిలా పరిమళిస్తుంది. కవిత్వంలో Mutual Respect అవసరం. సూరంవారి కవితలో ఆ మర్యాద పుష్కలంగా ఉంది. Real poem to change your life again and again. సూరంవారు చాలామంది లాగా T.V.ల్లో కనపడకపోవచ్చు. స్వీయాచరణ లేని ప్రవచనాలు చెప్పకపోవచ్చు. కానీ ధీర గంభీర పండిత ప్రవరునిగా లోకంలో వారికి గుర్తింపు వుంది. మామూలు వచన కవిత్వం రాసే నన్ను తమ కవిత్వానికి ముందుమాట రాయమని 'సూరం'వారు కోరడం 'బీరం'వారికి సువర్ణావకాశం, సుమధుర జ్ఞాపకం.

"ఏటివాలు జ్ఞాపకం"లోని తేటనీటి రుచి మాధుర్యాన్ని మీరూ ఆస్వాదించండి. 'సూరం'వారి వస్తుదృష్టి, భావసృష్టి మీకు నచ్చితే మనసారా అభినందించండి. కవికి సహృదయుల అభినందనకు మించిన సంపద ఏముంటుంది

శుభాకాంక్షలతో

బీరం సుందరరావు 21-3-2022

ప్రపంచ కవితా దినోత్సవం
21.3.2022, U.S.A.

# నా మాట

**క**విత్వం వ్రాయకపోవటం అధర్మం కాదు. వ్రాయటం ధర్మమూ కాదు. అదొక కళావిన్యాసం. భావవిస్ఫోటనం. ఒక రకమైన భావప్రసారం. భావప్రచారం.

వ్రాయటమే కవిత్వమైతే కవి ఒక్కడు చాలు. వ్రాసుకుంటూ పోతాడు. అది వస్తురూపకల్పన. దాని వినియోగం? నిర్వినియోగంగానో, దుర్వినియోగంగానో ఏ వస్తువూ నిలవదు, నిలవకూడదు కూడా! అందుకే పాఠకుడు అవసరమయ్యాడు. వీరిద్దరికీ మధ్య అనుసంధానాలూ అవసరమయ్యాయి. ఆ అనుసంధానాల పొందిక వివిధ రూపాలకూ, మర్యాదలకూ, అభిప్రాయ భేదాలకూ, పరస్పర నిందలకూ, గుంపులై పోగడుకోడానికీ, తెగతెంపులై విడిపోవడానికీ ... అన్ని అర్థాలకూ, అనర్థాలకూ కారణమైంది. పొందిక కుదిరితే భాయీ భాయీ అనుకోవటం, కుదరకపోతే చేయి చేయి విసురుకోవటం అలవాటయ్యాయి. అంతేకానీ అన్నింటితో అన్నింటికీ పొందిక ఉండదనీ, ఉండవలసిన అవసరమూ లేదనీ, ఒకదానితో పొందిక కుదరకపోతే అది వ్యర్థ పదార్థం అనుకోకూడదనీ అర్థం చేసుకోవటంలో అందరూ విఫలమయ్యారు, ఆధునిక సాంకేతికతలోని కంపాటిబిలిటీ(Compatability) పదం పరిచయమయ్యాక కూడా. ఈ ఘర్షణల్లో ఒకటి - పద్యమా? గద్యమా? అన్నది.

మనకు తెలివితక్కువవాళ్ళుగా కనిపించే పాత వాళ్ళెవ్వరూ - నాకు తెలిసిన మేర ఏ భాషలో అయినా - కవితా వస్తువు గురించి కానీ, రూపాన్ని గురించి కానీ ఘర్షణ పడలేదు. దేనికైనా సులువుగా ఉండే కొన్ని సూచనలు చేశారు లాక్షణికులు. కవులూ అంతే. పద్యాలు వ్రాసుకున్నారు. వచనాలు వ్రాసుకున్నారు. పద్యాల మధ్య వచనాలు వ్రాసుకున్నారు. వచనాలలో పద్యాలను ప్రయత్నపూర్వకంగానో, అప్రయత్నంగానో నిబంధించారు.

కానీ ఆధునిక కాలంలోనే ఒకరంటే ఒకరు ముఖం మాడ్చుకోవటం, చులకనగా చూడటం, వెకిలిగా మాట్లాడుకోవటం, విడివిడిగా ముఠాలు

కట్టుకోవటం నేర్చుకున్నారు, అదీ బడాయిగా. అన్ని వర్గాల వారూ మరచి పోయిందేమిటంటే రూపానికి ప్రాధాన్యమిస్తూ వస్తువునూ, కవిత్వాన్నీ పద్యాల వాళ్లు విస్మరిస్తే - వస్తువుకు ప్రాధాన్యమిస్తూ రూపాన్నీ, కవిత్వాన్నీ విస్మరించారు వచనాల వాళ్ళు. రెండింటినీ గౌరవించేవారిని ఇద్దరూ గౌరవించకపోగా ఇద్దరూ పక్కకు నెట్టివేయటానికి అలవాటుపడ్డారు. అందరూ కాకపోవచ్చు. (ఏ ప్రతిపాదనకూ నూరుశాతం అనుకూలతా ఉండదు, వ్యతిరేకతా ఉండదు.) అయినా నా వంటి వారం రెండింటినీ గౌరవిస్తూ పోరాడుతూనే ఉన్నాం.

అభ్యుదయ కవిత్వ శకం ప్రారంభమైనప్పటి నుండీ వస్తువు ప్రధానమై రూపం రూపాన్ని కోల్పోయింది. అది పెద్ద లోపమని గ్రహించి కూడా అంగీకరించటానికి మనసొప్పక చాలా చాలా నష్టం చేశారు సాహిత్యానికి. ఆధ్యాత్మిక తత్త్వవేత్తలు 'నేను'తో చేసిన, చేస్తున్న విన్యాసాలను వచన కవులు కూడా చేశారు, చేస్తున్నారు. నేను అంటూ ప్రారంభిస్తే తప్ప చాలామంది వచన కవిత్వాన్ని అసలు వ్రాయలేరు. మనకేమో వాళ్ళూ అర్థం కారు. వీళ్ళూ అర్థం కారు.

ఆ దశలో వీలైనంతగా వస్తురూపాలనే కాక ప్రయోజనాన్ని కూడా గౌరవిస్తూ కవితలు నిర్మించే నాలోని ప్రయత్నశీలతలో ఒక దశ "ఏటివాలు జ్ఞాపకం". నా కవితలకు శ్రీమతి **ఆసూరి మరిగంటి సులోచనా రంగాచార్య స్మారక పురస్కారాన్ని** అందించిన **సాహితీ సిరికోన వాక్స్థలి (వాట్సాప్)** పత్రిక నిర్వాహకులకు కృతజ్ఞతలు.

ఏటివాలుజ్ఞాపకంపై సహృదయతతో తమ అభిప్రాయాలు అందించిన డా|| రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి గారికి, డా|| బీరం సుందరరావు గారికి, పురస్కార వ్యవస్థాపకులు శ్రీ వేణు ఆసూరి గారికీ కృతజ్ఞతాభివందనాలు. పుస్తక ముద్రణలో సర్వం తానైన శిష్యుడు చి|| విట్టుబాబుకు అభినందనాశీస్సులు.

ఎప్పటికప్పుడు కవితలను చదువుతూ అందించిన సహృదయుల కందరకూ నమస్కార పూర్వక ధన్యవాదాలు.

*- రచయిత*

# మేమో...మనమో

కడలిలా కలుపుకు పోవాలో
నదిలా ఒరుసుకు పోవాలో
ఇప్పటికీ తెలీని మనుషులం
అందుకే మనకు
హరిశ్చంద్రుడూ ఆదర్శమే
ధర్మరాజూ ఆదర్శమే
శ్రీరాముడూ వందనీయుడే
ప్రహ్లాదుడు భావనీయుడే
వంకరటింకర గీతతోనే
వీళ్ళంతా కలిసేది
వంకరలోని ఋజుగతిసూత్రం
మనిషి కెప్పుడు తెలిసేది?

మూడడుగులు యాచించి
మొత్తం ఆక్రమించిన
వామనుడూ మన అవతారమూర్తి
రాజ్యాలన్నీ సొంతమైనా
నాకెందుకివన్నీ అనుకొన్న
పరశురాముడూ మన అవతారమూర్తి
అంతస్సూత్రం అవగాహనకొస్తేనే
అవతారతత్త్వ మైనా అర్థమయ్యేది
మనసులో తలపులను పుటంపెడతాం
అనుభవాలతో భావనచేస్తాం

అందరికీ పంచేక్రమంలో
అరకొరగానే కొలతలు వేస్తాం
ప్రసారంలో తేడా
అటుందో ఇటుందో తెలీక
సగం సగంగానే మిగిలిపోతాం
ఆరోపాలన్నీ
విడివిడిగా తప్పని లెక్కలే
మొత్తం కూడితే మాత్రం
లెక్కలో ఎప్పుడూ తేడాలే

ఏకవచనంలో ఏనాడూ
వ్యాకరణదోషాలు దొర్లటం లేదు
బహువచనంలోకి వస్తేనే సమస్య
మేమో మనమో అర్థం కాదు
క్రియ సమానమే అయినా
ఫలానుభవంలో మాత్రం
పట్టుదొరకని వైరుధ్యం

కలుపుకొంటూ పోవాలో
ఒరుసుకుంటూ పోవాలో
మహావిస్ఫోటనంలో
ముక్కలైన మనస్సులన్నీ..
రవ్వలన్నీ కలిసి మండితే
మంట గగన మంటుతుంది
మనస్సులన్నీ కలిసినవ్వితే
విశ్వమంతా వెన్నెలై విరుస్తుంది ★

# నాతిచరామి

ఉషోదయాన వ్రాసిన కవిత
సూర్యోదయానికి ముందే
ప్రపంచాన్ని చుట్టేసిన ఆనందం కన్నా
ఎన్ని హృదయాల అనుసంధానానికి
అడ్డుగీతలు  గీస్తున్నానో అన్న
ఆందోళన నన్ను క్రుంగదీస్తుంది

ఎక్కడెక్కడి ఒంటరిమనస్సులకో
బహుకుటుంబీకభావన కలిగిస్తూ
కుటుంబాల కూటమిలో మాత్రం
ఎవరిలోకంలో వారుగా విడదీస్తూ
ఏ జ్యామితిగణితానికీ
ఇద మిత్థ మని తెలియకుండా
ఏ గ్రాఫ్ గీయటానికీ
ఎప్పటికీ వీలుకాకుండా

ఒళ్ళంతా ఆకుపచ్చగాయాలతో
నా చరవాణి నా వైపు దీనంగా చూస్తుంది
నాతిచరామి అంటూ నేను
పొదివి పట్టుకొని
ఎప్పుడు తిన్నదో ఏమో అని

నాలుగు మెతుకులు తినిపించి
వ్రేళ్ళతోనే గాయాలపై స్పృశిస్తూ
సుతారంగా సవరిస్తాను
మందూ మాకూ అద్దినట్టుగా..
అన్నీ మాయం
అంతలోనే మరో ..మరో..మరో గాయం
తెలిసికొట్టేవాళ్ళు కొందరు
తెలిసీ తెలీనోళ్ళు కొందరు

చుట్టూ ఉన్న లోకం గుర్తుకొస్తుంది
నాకన్నా ముందే లేచి
సుప్రభాతాలకు లంకించుకుంటుంటే
అర్ధరాత్రే లేచిపోవాలనిపిస్తుంది
ఆ మరునాటినుండీ...

నాలుగు గోడలమధ్య
నలుగుతున్న నేరానికి
నలుగురూ ఒకే కుటుంబం కానీ
ప్రతిరెండుగుండెల మధ్యా
ఎన్నెన్ని అగాథాలో
ఎంతెంత లోతులో
త్రాటివంతెనలకూ మళ్ళబడవు
అవసలు కనిపించవు గదా!
రంగులవలయాల్లో

అన్నీ అద్భుతంగానే కనిపిస్తాయి
పిప్పాపాట లాగా
ప్రపంచమంతా బాగుంటుంది..

ఉప్మాలో ఉప్పెక్కువని
కూరలో కారమెక్కువని
నసిగే శాల్తీలిప్పుడు లేరు
చేసే దొకడు
తెచ్చే దొకడు
తినే దొకడు
చట్టం ప్రకారం చూస్తే
ఎవరైనా దోషి కావచ్చు
ఎవరిమీద నసుగుదల
ఎందుకొచ్చిన విసుగుదల

ముప్పై రూపాయల రోటీకి
మూడొందల రూపాయల కర్రీ కొని
...జి.ఎస్.టి అదన మండోయ్...
మురిసిపోతూ తింటున్నాం
పంచె పెద్దదో అంచు పెద్దదో
అర్థం కాకుండా బ్రతికేస్తున్నాం

ఎప్పుడో చేసిన
ఉపనిషత్తుల ఆలోచనలకు

నెత్తిన మేకుకొట్టి
అక్కడే ఆపిన అసమర్థులమా?
అర్ధశతాబ్దం కాకముందే
అమ్మో అనిపిస్తున్న సాంకేతికతను
నియంత్రించగల నెత్తురు లేక
నీరుగారిపోతున్న సమర్థులమా?

ప్రవహనశీలమైన కాలానికి
ఎన్నెన్ని శక్తులు ఆనకట్టలు కట్టినా
అన్నింటినీ మోళ్ళుగా మిగిల్చి
కాలం సాగుతూనే పోతోంది
ఒంటికైన గాయాలతో మాత్రం
పాతనొప్పులను ప్రసవిస్తూనే ఉంటుంది



# పృథివీ నిత్యయౌవనా

ఒక మంచుముక్క
కరగటం మాని
పెరగటం నేర్చుకొంది
హిమగిరిగా మారి
జీవనదులకు జీవంపోస్తోంది

ఒక నీటిచుక్క
ద్రవించటం మాని
గడ్డకట్టడం నేర్చుకుంది
ఘనంగా జీవిస్తూ
తలాలను పొలాలు చేస్తోంది

ఒక ధ్యానం
మౌనంగా కాక
మాటగా మారింది
ఋక్కుగా సూక్తంగా
వేదంగా నాదంగా వెలిసింది

ఒంటరితనంలో
అందరిదీ మౌనమే అయినా
మందిలోకి వచ్చిన తర్వాత

మాటగా మారిపోదాం
మాటలే మంత్రాలై
మంత్రాలే మధువనాలై
మానవతామహోన్నతికి
మార్గదర్శకాలు అవుతాయ్

నీటిచుక్కల పక్కన
చిక్కగా విరిసిన నాగరికత
గగనసీమలనూ దాటి
సొగసులన్నీ ముడుపుకట్టి
మబ్బుపింజలుగా మారి
తేలికై ,తరాలమధ్య చీలికై
మళ్ళీ ఘనీభవించాలని
ముక్కలన్నీ ఏరుకుంటుంది

మంచుముక్క కరిగినా
కన్నుల్లో కారణ్యమై
గుండెల్లో ఘనసారమై
పలుకరిస్తూ పరిమళిస్తూ
ఒంటరితనానికి ఊతమై
అష్టాంగమార్గానికి
అనుభూతివేదికయై గీతికయై
పృథివిని నిత్యయౌవనను చేస్తుంది.



# అంధకారానికి అటూ ఇటూ

అటు..
చూడు...
చూడగలిగి నంతమేర
వెనక్కు చూడు
చీకటిముద్దలా కళ్ళకేదైనా కనిపిస్తే
కళ్ళు చిట్లించి మరీ చూడు
ఆ వెనుకే వెలుగుకొండలు
శిఖరాలను మోస్తూ నిరీక్షిస్తుంటాయ్
వెలుగురేకల వెండిదారాలతో
ప్రపంచానికి మేఖలగా నిలవాలని..
చరియలలో కురుస్తున్న మబ్బులకు
కన్నీటి కథలు వినిపిస్తుంటాయ్
జలజల జారే సెలయేళ్ళలో
మాటలై పాటలై పరవశించాలని..

విశ్వాంధకారంలో
మన ప్రయాణానికి ముందు
తొలివెలుగు రేఖ
ఎలా పొటమరించిందో
ఆనవాళ్ళు దొరుకుతాయేమో
గుడ్లప్పగించి వెతుకుదాం

ఊరంతా వెలుగైనా
ఉత్సాహం నిండని మన కళ్ళకు
అక్కడేదైనా ఆలంబనం
దొరుకుతుందేమో అన్వేషిద్దాం

తమసో మా జ్యోతిర్గమయ అని
తరతరాలుగా వాపోవటం తప్ప
చిరు సిరి చేతుల మాటున దాచి
మందికోసం ఒక్క తిర్లిక నైనా
స్నేహం నింపి నిలబెట్టామా?..

అసలు వెలుగే
మనలను వెతుకుతూ వచ్చిందేమో
ఏ ప్రాణికీ కరదీపిక కాకపోతే
ఏ వెలుగుకూ విలువే ముందనీ
ఏ గుండెలోనూ గూడుకట్టకపోతే
ఎంత వేగమున్నా ఎవరికేం లాభమనీ..

మాటలో పాటలో బాసలో యాసలో
పదంలో కదంలో  కంటిలో మంటిలో
నలుగురూ ఒక్కటిగా నవ్వుకునే చోటులో
తోటలో కోటలో చాటులో మాటులో
చూడగలిగే కళ్ళుండాలి కానీ
కాంతికణాలు కనిపించని చోటెక్కడ?

కన్నుల్లో ఈసులే ఊసులాడుతుంటే
వెలుగులు విహరించే విహాయస మెక్కడ?

చీకటినీ ప్రేమిద్దాం
గుండె కలుక్కుమన్నచోట
గుర్తుగా మిగిలిపోతుంది
పొదివి నిలుపుకుందాం దాన్ని
యెదలోనే పదిలంగా
వెదజల్లుదాం వెలుగును
విశ్వమంతా నివ్వెరపడేలా..

కానీ
కాళ్ళు కదలాలి
కడదాకా నడవడానికి
చేతులు సాగాలి
చివరికంటా విసరడానికి
కళ్ళు చెమర్చగలగాలి
కపోతాన్నీ కావ్యనాయకునిగా
కాలనాళికలో నిలపడానికి...

ముడిచిన వ్రేళ్ళే జీవితమైతే
లోపలంతా చీకటే
వ్రేళ్ళు విశ్వం వైపు సాగితే
వెలుగు కరతలామలకమే.

★

# ఇద్దరం కలిస్తేనే

పద్య మల్లాను ..అద్భుత మన్నావ్
పాట వ్రాశాను ..పరమాద్భుత మన్నావ్
ఛలోక్తి విసిరాను ..సెహబాష్ అన్నావ్
మౌనంగా కూర్చున్నాను ..వేదఋషి నన్నావ్
ఒట్టేసి చెప్పు.. నన్నేం చేయదలచుకున్నావ్?

తల ఉంది గదా అని ఊపుతున్నావా?
ఫలమేదో దొరుకుతుందని కాపుకాశావా?
నేనేంటో నాకెరుకే ..నా కవిత్వమేంటో నా కెరుకే
రాళ్ళనూ కరిగించే రాగాలు నాకు రావు
వ్రేళ్ళనూ పెకలించే విప్లవమూ నాకు తెలీదు

నాతోపాటు నిన్నూ శ్రుతి కలపమంటా
నాలాగే నిన్నూ ఉపకృతిగా మారిపొమ్మంటా
నేనూ నీలాంటివాణ్ణే..నాలాగా ఉండకూడదా అంటా
ఇద్దరం కలిసి నడిస్తే చెరిసగం చేసికోవచ్చంటా
నువ్వు వేరేలే అంటూ నన్ను కేటాయించి
తప్పుకుంటావ్

నీలాగే నాదీ గుప్పెడు గుండెతో శ్వాస
నీలాగే నేనూ భవిష్యత్తు మీద ఆశ

క్షుణ్ణమైన బాటలో సృజనగా మారి నేను
క్రొత్తక్రొత్తకలలతో పురావైభవమై నువ్వు
మనిద్దరం వర్తమానానికి సారథులం

పండుటాకుల గలగలలలోనూ
పాటలపందిళ్ళ పరవశాన్ని నేను
పచ్చని చివుళ్ళ మధ్యలోనున్నా
శిశిరాన్ని తలచుకునే భయానివి నువ్వు
మాలికి మనం  కుడిఎడమ భుజాలం

ముంగిట్లో ముగ్గుల మధ్య మురిపెంగా నడుస్తూ
గీతల ఘర్షణల్లోనూ సమైక్యాన్ని చూస్తూ నేను
పెరటిలో దుగ్గును విసుగ్గా కదలిస్తూ విదిలిస్తూ
కలిసి ఉండటాన్నే కల్మషంగా భావిస్తూ నువ్వు
ఆ యింటికి  ఇద్దరమూ ఆయువుపట్టులం

ఆవల కాశీకావళ్ళతో కథలు మోసుకుంటూ నువ్వు
ఈవల ఇసుకరేణువులు శక్తితో ఎదుగుతున్న నేను
ఇంద్రధనుస్సులై బ్రతుకులన్నీ నడవాలంటే
ఇంకా ఎన్నో పార్శ్వాలు  కావాలి
రంగులవలయాలతో
సమాంతరంగానైనా ఇద్దరం కలిసే సాగాలి

పద్య మాలపిస్తున్నాను..
చిటికెలతో ఆవులిస్తున్నావ్
పాటలను పాడుతున్నాను..
అలసటను నటిస్తున్నావ్
ఛలోక్తి విసిరాను..
నవ్వు ఎక్కడుందో వెతుకుతున్నావ్
మౌనాన్ని ఛేదించి పలుకుతున్నాను..
మ్రాన్పడిపోతావేం నువ్వు
ప్రమాణం చేసి చెప్పు
నువ్వేం కాదలచుకున్నావ్



# చినుకుల సందడి

రాత్రి కురిసిన వాన
చినుకు చినుకుగా ఆగిపోయి
మళ్ళీ నిద్రలేవకముందే..
కేరింతలు కొడుతూ ఎగురుకుంటూ పోయి
ఒళ్ళంతా శూలాలు గుచ్చుకున్న వీరభక్తుల్లా
డొంకబాటల కటూ ఇటూ నిలిచి
కలువలు తామరల కలబోతలాంటి
పూలతో పులకిస్తున్న బ్రహ్మజెముళ్ళను చూస్తూ
అన్ని ముళ్ళు ఒళ్ళంతా పరుచుకున్నా
ఆ మొక్కమనస్సులో
అంత మార్దవం ఎక్కడ దాగిందో ఆలోచించవచ్చనీ..

డొంకబాటలమీద
ఆ రాత్రే మొలిచిన పడియల్లో పడి
లేవలేకపోతున్న మబ్బుముక్కల్ను
పాదాహతులతో పైకి పంపవచ్చనీ..

బురదను తప్పించుకుంటూ
బాటకు కుడి ఎడమలా నడుస్తూ
జిగ్ జాగీకృత మానవులమై
ప్రాచ్యపాశ్చాత్యనాగరికతలకు
ముడులువేస్తూ మురిసిపోవచ్చనీ..

తుంపరవాన పడుతుంటే
గొడుగులా తలకాచిన ముంగిటివేప
పెనువానకు తానే తడిసిముద్దై
చిరుగాలి వీచగానే
ఒళ్ళువిరుచుకుంటూ
మళ్ళీ తుంపరలు కురిపిస్తుంటే
సావాసగాళ్ళను చెట్టుక్రిందికి లాగి
కావాలనే చెట్టుకొమ్మలు కులికించి
మనం మాత్రమే చురుగ్గా పరుగెత్తవచ్చనీ
వణకు నటిస్తూ వేషాలు వేయవచ్చనీ..

అడుగు తీసి అడుగుపెడుతుంటే
నిన్నమొన్నటి పాదరక్షలు
బురదతో మమేకమై
అక్కడే ఆగి పాదం మాత్రమే పైకొస్తుంటే
ఆ క్షణంలో అడుగుతాకిన చెప్పుకు
పైకి లాగుతున్న పాదానికీ
మధ్యనున్న టగ్ ఆఫ్ వార్ ను
ఆస్వాదిస్తూ ఆనందించవచ్చనీ..

ఇంటిముందు మురుగునీటికాలువలు
హఠాత్తుగా మంచినీటికాలువ లైతే
పెద్దవాళ్ళూ చిన్నవాళ్ళూ ఏకమై
కాగితాల కత్తిపడవలు చేసి వేసి
తడిసి పగిలిపోయేదాకా వాటినే చూస్తూ

కాలువ ప్రక్కనే నడుస్తూ
ఏకాగ్రదృష్టిని అభ్యసించవచ్చునీ..

చూరునీటిబొట్లు
తేనెరంగులో గాలిబుడగలై
ఆగి ఆగి ఆగి వరసగా
ఒక్కొక్కటిగా బడుతుంటే
ఏది ముందు నేలకొరుగుతుందో అని
పోటీలుపడి అంచనావేస్తూ
గెలుపోటముల రుచిని ఆస్వాదించవచ్చునీ..

మళ్ళీవానరాకను సూచిస్తూ
తూనీగలు విమానాలై విహరిస్తుంటే
పొడముతున్న పుట్టగొడుగులతో నేల
నిన్నలేని అందాలను సంతరించుకుంటుంటే
పుడమి ఆర్ద్రమై మట్టివాసనలతో పలుకరిస్తూ
అంతరంగాన్ని సుతారంగా తాకుతుంటే
తడిసిన గడ్డిని పశువుల కట్టుముట్లనూ
ఆరబెట్టుకుంటూ చెమట కారుస్తుంటే
నెమ్మెక్కిన అగ్గిపెట్టెలు మొరాయిస్తుంటే
విసువులోనూ ఉత్సాహాన్నీ
శ్రమలోనూ సౌందర్యాన్నీ
అలసటలోనూ ఆనందాన్నీ
అనుభవంలోకి తెచ్చుకోవచ్చునీ..

★

## విత్తనాలవడ్లు

గతం
గతః కాదు
అది అనుగతివ్రతమై
వర్తమానసంగతమై
భావిజీవనదిక్సూచియై
దారిచూపి నడిపిస్తుంటే
కాలం సుళ్ళుతిరుగుతూ
ఏరులా ఎగిసిపడుతూ
మైదానమై పరుచుకుంటుంది
చలించని చరద్రాత్రులను దాటి
పగటివేడిగా పరిహసిస్తుంది

నింగిజారు తొలకరియై
పొలాలలో మొలకలై
పాలుపోసుకున్న గింజలై
కళ్ళెంలో ధాన్యమై మాన్యమై
మనిషి మనుగడకు భరోసా ఇస్తుంది..

గతం
కరిగిపోయిన మంచుపొరే గాదు

కరుగుతూ కళ్ళలో వెలిగించిన
ఆనందపు టానవాళ్ళూ, చిరునామా..
తరిగిపోయిన వయస్సే కాదు
తరుగుతూ గుండెల్లో మొలిపించిన
సౌహార్దపల్లవాల తరళతరళారుణిమ

నిన్న నేటికి పునాదే కానీ
మొన్నటికి సమాధి కాకూడదు

మోడువారిన మ్రానులే
మరునాటికి చిగురించేది
నెఱ్ఱులు వారిన నేలలే
వెన్నముద్దలై ప్రసవించేది
అహోరాత్రాలు అంతరించినా
అవే కలలు మళ్ళీ ప్రపంచిస్తాయి
అంతరించిన నాగరికతనూ
అవే మూసినకళ్ళముందు
అన్నిరంగులూ ఒలికిస్తాయి

దూదిపింజల్లాంటి శరన్మేఘాలూ
వార్షుకాభ్రకాల శేషవస్త్రాలే
శిశిరం ఆకులన్నీ రాల్చినా
వసంతానికి "వాసాంసి జీర్ణాని" అదే

పాట విస్మృతికి గురికాకుండా
పల్లవి పల్లవిస్తూనే ఉంటుంది
మాట గాలిలో కలిసిపోయినా
మౌనం వెతుకుతూనే ఉంటుంది

చిరువెలుగుల నేపథ్యంలో
చీకటెంత విశాలమో తెలుస్తుంది
బియ్యానికి పురుగుపట్టినప్పుడే
పైపొట్టు శక్తేమిటో తెలుస్తుంది

వైవస్వతమనువు కూడా
విత్తనాలు చేతబట్టే నావెక్కాడు
నేల కనికరించేదాకా
నింగివైపే దృష్టి నిలిపుంటాడు
బక్కచిక్కిన రైతుకూడా
విత్తనాలవడ్లే బంగారమంటాడు.
తొలకరి పలుకరించేదాకా
తొలిపలుకులు నెమరేస్తుంటాడు



# మాలిమి మన పాట

నొప్పించటం చేతకాని ఓ మంచిమాట
నొచ్చుకోవట మెరుగని ఓ మంచిమనస్సూ
ఒకే భావంతో పులకరిస్తే
విశ్వగీతమై పలకరిస్తే
మనిషికీ మనిషికీ మధ్య
మమతల తేనెతొలకరులు కురిసి
గొంతునూ గొంతునూ కలుపుతూ
కోటిరాగాలు కొలువు తీరుతాయి

మబ్బుముక్కల్లోని మసకలను తప్పిస్తూ
గగనసీమల్లో గాలిపడవపై సంచరిస్తూ
ఆనందాల అంచులను అలా సుతారంగా తాకి
అక్కడే అలసట తీరి అనంతాలైపోతాయి
“రసో వై సః” సూత్రానికి
భాష్యవచనాలక్కడ దొరుకుతాయి

మింటికొనల్లో విచ్చుకున్న మెరుపు
వేల తలపులకు మేలుకొలుపై
చీకట్లలో నైనా చొచ్చుకుపోయి
విశ్వగేహప్రాంగణంలో
వెలుగురేకల ముగ్గులు వేయిస్తుంది

రెప్పవాల్చిన కళ్ళలోనూ క్షణం
బ్రతుకంత భావమై పరిమళిస్తుంది

కటికచీకటిలోని కమ్మని పిలుపు
విసువుతో పారిపోతున్న
ఊపిరికాళ్ళకు బంధాలు వేసి
శతమానం భవతి దాకా
తోడుగానే నిలుస్తానని
తనమీదా మనమీదా కాదు
ఒట్టుమీదే ఒట్టు వేయిస్తుంది

ఒంటరితనంలో చేసాచిన తోడు
తానే నీడై గూడై
కాలాన్ని కథగా మార్చి
కోరుకున్న మలుపులతో
తనివితీరా చుట్టుకొని
ముగింపుదృశ్యాల్లోనూ
ముచ్చట్లే కురుస్తుంది

మన అమాయకత్వం కాకపోతే
మన చుట్టూ ఎంత రక్షణ ఉందో..
ఒంటికి కవచంలా గాలి
అది కప్పని తావు లేదు
కదలికలన్నీ తనవే..

కంటిలో నిరంతరసంక్రాంతి
అది దాచలేని బొమ్మల్లేవు
కొండైనా అక్కడ కొంచెమైపోతుంది..
మనస్సు పదునాలుగులోకాలకూ
నిలువెత్తుగా పట్టిన రంగుటద్దం
దానిముందు దగాకోరు మనుషులైనా
దండంపెట్టి పోవలసిందే

కనురెప్ప కాటువేయకుండా
కంటిని కాపాడుకుంటే మనుగడ
ఝంఝామారుతం దూసుకొస్తున్నా
పాదం పదునుదేరి ఉంటే నిలకడ
మనస్సు కొంచెం మారాం చేసినా
పల్లవించిన మాలిమి పాటే
అనంతాకాశంలోనూ సేదదీరే తలగడ



## తొలిఓటమి....

(నవో నవో భవతి జాయమానః)

జీవితంలో తొలి ఓటమి
ఇక జీవించటాని కేమీ లేని ఓటమి
కాలంచేత కూడా కంటతడి పెట్టించి
ఉద్వేగాల ఉక్కపోతను
ఊపిరంతా బిగించి అదిమిపట్టి
పంచభూతాలనూ పలుకరిస్తూ
నన్ను నేనే వాటితో కలబోసుకొని
అనంతాకాశం వైపు అలవోకగా నడిచి
విశ్వచైతన్యానందంలో విలీనమై..
గెలిచిన మృత్యువును అభినందించేందుకూ
నేనంటూ ఏమీ  మిగలని ఓటమి
జీవితంలో తొలిఓటమి

ఆవేశకావేశాల అంతరాంతరాల్లోనుంచీ
ఆల్చిప్పలా నోరు తెలిచి
మెతుకు జార్చండి చాలు
ముత్యం చేస్తానంటూ
ఆక్రోశిస్తున్న ఆకలి అంతరంగాన్ని
పట్టించుకున్నట్టే నటించే
ప్రపంచమేధావుల ముందు

నేనూ నటించా ఓడిపోయినట్టు..
ఆకలి బడబగా లేచి చెలరేగి
సప్తసముద్రాలనూ ఆవిరి చేసి
ప్రపంచాన్ని ఎడారిగా చేయకముందే
ఆకలిని గౌరవిస్తూ ఎపిటాఫ్ వ్రాసిపెట్టా
ఓటమిపట్టికనుండీ నాపేరు చెరిపేసుకున్నా

బ్రతుకుపయనంలో గాయాలను
జ్ఞాపకాలుగా మలుచుకొని
అనుభవాల రక్షకపత్రాలతో
అంతరంగాన్ని పదిలపరుచుకొని
ఆరనిగుండెమంటలను
అభ్యుదయజ్వాలాతోరణాలు చేసుకొని
కోరికలకెరటాలు భంగపడి పాయలైతే
బిందువులోనే సింధువును చూడటం నేర్చుకున్నా..

బొట్టుబొట్టునూ దాచి పట్టుపెట్టే తేనెటీగలు
ఆత్మార్పణతో పానుపులు పరిచే పట్టుపురుగులు
గెలుపు గెలుపుతోనే పోటీపడటం చూపాయి
సాలీళ్ళు ప్రతిపతనంతోనూ
సౌధాగ్రాలను స్పృశించటం నేర్పించాయి
పొట్టేలు వేసే ప్రతి వెనకడుగు
గెలుపును ఢీకొట్టే ముందడుగే

అందుకే
నాకే కాదు నీకూ, వాడికీ, వీడికీ
ఒకటేమిటి..
పిపీలికాది బ్రహ్మపర్యంతానికీ
ఓటమి ఒకటే ఉండాలి
అది మరణమే అయ్యుండాలి
ఆ మరణమే మరో పుట్టుకకు
విజయకేతనమై రెపరెపలాడుతూ..



## పల్లవిపాటలు

ఆవేశం అర్థాంతరంగా ఆగిపోయి
తరతరాల భావదారిద్ర్యం తన్నుకవస్తోందా?
కాలు ఎటు కదుపుతున్నా ఒక సంప్రదాయసమావర్తం
నీళ్ళకు బదులు నిప్పులు క్రక్కుతూ
మనిషిని ఎదగనీకుండా మైలపరుస్తూనే ఉందా?
ఎదిగిపోతున్న మెదడుఎత్తులకు
ఎదుగలేని మనస్సు ...పిచ్చిమనస్సు
పాదాలమీదనే పడి లుంగలు చుట్టుకుపోతుందా?

అదంతే..అలాగే సాగనీ..
ఆగమాగం చేస్తూనే అయినా అలాగే సాగనీ

ఎప్పుడో పుట్టిన తొలిపలుకులను
చిలకపలుకుల్లా దాచుకొని
వేల ఏళ్ళ తరబడి అర్థంలేకుండా వల్లించి
నిన్న మొన్ననే భాష్యాలు వ్రాసుకున్నవాళ్ళం
తమలపాకుల లెక్కల్లోనే ధర్మాన్ని కొడిగట్టిస్తూ
తాంబూలంలో తొడిమ అటా ఇటా అని
అనుమానిస్తూనే అడుగులేస్తున్నవాళ్ళం
ఉపనిషత్తుల తలమీద కొట్టినమేకుకన్నా
నీ కాలికి తగిలిన ఎదురు దెబ్బ గొప్పదా?

ఆగిపోనీ ఆవేశాన్ని..ఏమైందట
ఆసముద్రక్షితీశులైనా అలల దెబ్బకు జడిసి
తీరాల్లోనే తేలియాడుతుంటారు..అంతేగా

ఆ.లో.చ.న నిరంతరప్రవాహమంటూనే
అక్షరాల మధ్య ఆనకట్టలు కట్టేస్తోంది
ఇంకానయం ..కళ్ళకింకా గంతలు కట్టలేదు
మన కళ్ళతోనే సొంతంగానే చూడనిస్తోంది
మన కాళ్ళకింకా గుదిబండ వేయలేదు..
మనవేగంతోనే మనలను నడవనిస్తోంది
ఆనందించవేం?
ఎత్తిన గేటుతోనే ఎడారి పండించుకోవేం?

అయినా నీ హడావుడి కాకపోతే
అన్నీ అమర్చినదానిలో
అత్తగారిలా వ్రేలు పెడతావా?
ఆవేశ మని ఆవేశపడటమే కానీ
సార్థకం చేసుకొని చరిత్రగా మారిందెందరు?

ఆనందానుభవాలన్నీ
అర్థాంతరసంక్రమితవాచ్యధ్వనులే
సుఖాలని ఎగిసిపాటే తప్ప
అవి శూన్యాకాశసుందరస్వప్నాలే

అన్వేషణ ఆరంభించని వాడూ లేడు
అంతు చూసి నిలిచినవాడూ లేడు
జయాపజయాల క్రీనీడల్లో
దాగీదాగని దగాబొమ్మలు
పల్లవులతోనే ఆగిన పదునుదేరిన పాటలు
ఆవిష్కరణలు లేకుండానే
హరోం హరోం లతో పల్లకీమోతలు



# ఏటివాలు జ్ఞాపకం

ఎండిపోయిన ఏరు
ఎన్ని కథలకు సాక్ష్యం పలికినా
వేసిన ఇసుకమేటలపై
ఎన్ని పాదాలు ఇష్టారాజ్యంగా తిరిగినా
కరిగి సొరిగిన బెడ్డలనుండీ
పొలికేక లెన్ని విన్పించినా
కదిలిపోయిన కాలంలోని
ఏరువాక లెన్ని ఎలుగెత్తి పిలిచినా
మళ్ళీ చెమర్చి నీరయితేనే
ఏటికింత విలువ
మళ్ళీ కూలంకషమై పారితేనే
మనిషి యింట చలవ

కథ నిన్నటిదైనా
ముగింపు నేటిది కావాలి
మల్లె నేలరాలినా
పరిమళం పరువెత్తిన వైపు
పదం కదం త్రొక్కుతూ నడవాలి
కాలం సజీవచైతన్యం
సమాంతరంగా పరుగెత్తితేనే
అడుగుజాడలు ఆదర్శంగా నిలిచేది
నిన్న నిండిన ఏరు

నేటికే ఎండిపోతుంటే
భుజంలోతు లోడినా
చలమల్లోనూ తడి తగలకపోతే
అది ఏరెలా అవుతుంది?
నిన్న మొలిచిన మొక్క
నేటికే వాలి కూలిపోతుంటే
అది మ్రానెలా అవుతుంది?

ఏరు ఉరకలెత్తుతూనే
పచ్చికబయళ్ళ తివాచీలతో
పంటపొలాల పచ్చదనాలతో
చిరుకెరటాల స్వాగతగీతికలు పలకాలి
చెట్టు గాలి కూపిరు లూదుతూనే
గగనతలమంతా సాము గరిడీలు చేస్తూ
శ్రావణమేఘశకలాలు శిరసావహిస్తూ
సస్యశ్రీకి తెల్లగొడుగులు పట్టాలి

ఎదగని తరువుల నీడలో
ఎంతకాలం సేదదీరగలం?
చుక్క చుక్కా నీరు లెక్కబెట్టుకుంటూ
ఎంతకాలం నిలద్రొక్కుకోగలం?
పుట్టి పదికాలాలైనా
పట్టెమంచంలా పడుంటే
పీర్లు గుండానపడే వేళకైనా
సమాజానికి ఒక జ్ఞాపకమై
ఎలా మిగలగలం? ★

## నేనేమన్నానని....

మనమూ మనమూ మనసున్న మనుషులం
ఒకమాట నేను అనావచ్చు మీరు పడావచ్చు
అయినా నేనే మన్నానని..నిన్నేమన్నానని..
అనుకున్న మాటలు అందరమూ పాటిస్తే
మహీతలంలో మనమే మహోన్నతులం
మనతలం మమతల బృందావనమో
ఆనందనందనమో అవుతుందన్న ఆశ
అంతే కానీ
అందరినీ ఏదో అనటం
నాకేమన్నా అందలాల మోతా?

కునారిల్లుతున్న హృదయాల్లో
ఘనీభావతను కరిగించగలిగితే
రసోజ్జీవజానపదగీతికలో
జగజ్జీవవిద్యుల్లతాకలికలో
పుడమిని పలుకరిస్తాయని
అదొక ఇదే కానీ
అందరినీ కదిలించటం
నాకు కరాతలామలకమా?

కట్టెలు మండి దూరమై నెగళ్ళు నుసిపడితే
అక్కడే నొక్కి కణిక విరిచి ఎగసనదోస్తే
మళ్ళీ మంటలు పాత్రనంటుతాయనీ

పరీపాకరసాలు పసందు విందులు చేస్తూ
అందరిబ్రతుకులూ రుచులూరుతాయనీ
కాకపోతే ..
కొరివితో నేను తల గోక్కుని
బట్టతలను తెచ్చుకుంటానా?

నిరంతరం అంతరాంతరతమోమార్గంలో
అలుపూ సొలుపూ లేని అన్వేషణలో
విశ్వమంతా కలిపే సూత్రం ఒక్కటైనా దొరికితే
అంచులలో ఆత్మరక్షణసంచారాల ఉనికి
తనంతతానే అదృశ్యమవుతుందని
లేకపోతే
స్థితప్రజ్ఞుణ్ణి కాలేకనా ?
ఆలోచిస్తూనే ఉంటాను

అలిసిపోయినవాడికోసం
అందరం ఆగుదామంటూ
కలిసిపోయేవాణ్ణి
కశ్మలమతితో అణచవద్దంటూ
అలల తాకిడిని
అందరం కలిసి ఎదిరిద్దామంటూ
కలల కలపోతలతో
కాలాన్ని కొలవలేమంటూ
మననమే మన మంత్రమంటూ
స్తబ్ధతే మన మరణమంటూ

ఆలోచిస్తూనే ఉంటాను.... ★

## మనుగడ

గిన్నెను ఎన్నుకోటంలోనే
కాలమంతా కదిలిపోతే
ముష్టిబ్రతుకైనా ముగిసేది
అర్థాంతరన్యాసంలాగానే

వస్తువు నెన్నుకోవటంలోనే
భావనాశక్తి బ్రద్దలైపోతే
అష్టాదశవర్ణనలున్నా
కృతి మిగిలేది రసహీనంగానే

శ్రుతిని సవరించటంలోనే
స్వరాలన్నీ తలక్రిందులైతే
సంగతుల సరంజామా ఎంతున్నా
కృతి మిగిలేది అమాంబాపత్తుగానే

రాళ్ళ నెన్నుకోవటంలోనే
రాతియుగమంతా గడచిపోతే
ఉలులు ఎంతగట్టివైనా
సంగమించేది సత్తురూపాలతోనే

ప్రయాణానికి సన్నాహాలతోనే
పుణ్యకాలమంతా పూర్తయిపోతే

అనుభవాల పల్లకిలో చోటు
ఆపై వచ్చే జీవితచక్రంలోనే

ఎప్పుడో పుట్టిన మామిడి
ఇప్పటికీ తలవంచుతూనే ఉంది
పడమటి గాలి పెత్తనానికి
కసుగాయల కప్పం చెల్లిస్తూనే ఉంది

ఎప్పుడో కుదిరిన గట్టు
ఇప్పటికీ నిలద్రొక్కుకుంటూనే ఉంది
శిబిచక్రవర్తిలా తనువెల్లా కోసి
వరదకు నైవేద్యం పెడుతూనే ఉంది

చినుకు సకాలంలో పడితేనే
స్వాతిముత్తమై మెరిసేది
చిలుక సకాలంలో పలికితేనే
తాత్త్వికార్థమై తనిసేది

తలపు ఆర్ద్రమై తపిస్తేనే
కావ్యరూపమై కరుణించేది
మలుపు మార్గమై నడిస్తేనే
గమ్యంలో  గడను పాతగలిగేది

★

## రాదారిపడవ

నిరంతర జలాంతర
సంచరన్మరాళమా..
రాదారి పడవే
నీ వ్యవహారనామమా?

మురిసిపోకపోతావా అని
శబ్దాడంబరంతో సంబోధించానే కానీ
నీ కివేం క్రొత్తలా? ..ఊరడింపులా?
శశ్వదుదవాసమహావ్రతశీతపీడితాచల
మునివ్రాతాలకు సంగడీడువు నువ్వు
అందుకే మునీంద్రుడవూ నువ్వు
పరాశరుణ్ణి తరింపజేసి
భారతాన్ని జ్ఞానభారాన్ని చేసింది నువ్వు
వైశంపాయనుణ్ణి వరించి
యుగాంతవేళలో ఉద్ధరించింది నువ్వు
మళ్ళీ మా గింజలను మాకు
శ్రీముద్రశుద్ధితో అప్పగించింది నువ్వు
రెండు తరాలకూ రెండు తీరాలకూ
నిత్యమూ  అంతరానివి నువ్వు
అంతం లేని నాగరికతాసంస్కృతులను
అనాదిగా మోస్తూ
అటూ ఇటూ మార్చుతున్నది నువ్వు

కోనేటినీళ్ళలోనూ కోవెలలా
కొలువుదీరుతావు
నదీజలాల ఒడిలోనూ
నర్తకివై ఒదుగుతావు
సాగరాల లోతులకూ
సమాధానమై తిరుగుతావు
అయినా నీకు నీళ్ళరుచి తెలీదని
టాంటాం వాయించి చెపుతాం మేము
పప్పులో తెడ్డూ నీళ్ళలో నువ్వూ ఒకటేనట
ఏమో!
త్రాగకుండానే రుచి చెప్పగలవేమో
వాగకుండానే వసపిట్టవు కాగలవేమో!

కరువలితో రెపరెపలై
పురుణించే తెరచాపలతో
సదా స్నేహశీలతతో
వీచీమృదుసేవలతో
తుషారబిందుసంగమ
ద్విశాలవిశ్వభావనతో
రాజీతో బ్రతుకుతావు
బ్రతుకుతీరు తెలుపుతావు

నీటితోటల్లోనే సంచారాలైనా
నీ వెరుగని తీరాలు లేవు

దుంగగా జీవిత మారంభించినా
మునిగిపోవాలన్నా
ముక్కలు కావాల్సినంతగా
ఊరంతగా ఎదిగిపోయావ్ నువ్వు
అలలపై అలవోకగా
అలా అలా కదులుతూ
వాటి ఎత్తుపల్లాలనే
నీ జీవనశైలిగా అంగీకరిస్తూ
నువ్వు వాటిని గౌరవిస్తూ
మచ్చిక చేసుకునే తీరు అమోఘం
అందుకే నీకు
పశ్చాత్తాపాలూ ప్రాయశ్చిత్తాలూ లేవు
పరిశుద్ధిమార్గాలూ లేవు

మేం లంగరేస్తే లొంగినట్టు నటిస్తావ్ కానీ
గాలి నీ తోడై గారాలు పోతున్నంతకాలం
గట్టు నానుకొని గుట్టుగా నిలవాలన్నా
నీటిపై నీటుగా కులుకులు చిలకరించాలన్నా
సర్వతోముఖస్వాతంత్ర్యం నీది
మేమేమో నిరంతరభయసంచారులం
బోనాలతో బ్రతుకులు వెళ్ళబోసే వాళ్ళం



## తోకమిగిలిన గాలిపటాలు

మరచెంబులోని అనాగరికతను
వాటర్ బాటిల్లో నాగరికతగా మార్చి
కుండీల తోటల్లో పెరిగే
బోన్సాయ్ మొక్కల ప్రక్కన నిలసడి
ఎత్తుపోల్చుకుంటూ విర్రవీగితే
గాలి రివ్వున వీస్తుంది
ఏమన్నదో తెలీకపోయినా
వెక్కిరించినట్లే అనిపిస్తుంది

ఎప్పటినుండో చూస్తునే ఉన్నా
మనిషేమో మారడు
మారాలన్న ఆలోచనలను మాత్రం
మానమన్నా మానడు

ఇల్లు సర్దుతూనే ఉంటాడు
వస్తువులను అటూ ఇటూ జరుపుతూ
మనసును మళ్ళవేస్తూనే ఉంటాడు
తలపులను తామరతంపర చేస్తూ
ఒలిచిన స్నేహితులు ను
వ్రతాలను నొక్కి పైకెత్తుకుంటూ
కరిగిన కాలం పేరిననెయ్యి అయితే

నంజుకుందామని కలలుగంటూ
గోదారిమీద మోజుతో
రోజూ వెన్న కరగబెట్టుకుంటూ..

చిన్నప్పుడు తెగిపోయిన గాలిపటానికి
తోక అమరిన సొగసులు తలచుకుంటూ
తుమ్మముల్లు గుచ్చుకున్న తాటాకు గాలిమరలు
కళ్లముందే తిరుగుతున్నట్టు భ్రమపడి
బొటనవ్రేలూ చూపుడువ్రేలు
కలిపినొక్కి పట్టుకుంటే..

నలభైపదుల వయస్సులోనే
నాలుగుయుగాలనూ చవిచూస్తాడు
కాలం పరుగెత్తుతుంటే తాను నడుస్తాడు
నిదానం ప్రధానమంటూ
కాలం నడుస్తుంటే తాను దుముకుతాడు
ఆలస్యాత్ అమృతం విషమంటూ
ఏమిటీ యుగాల లెక్కలని
ఎవరిమీదనో విసుక్కుంటూ
కాలజ్ఞానం పుటలలో
ఖాళీ ఆకులు వెతుకుతుంటాడు
ఆధునికసాంకేతికసహకారంతో
పురాతనజాతకాలు పరిశీలిస్తుంటాడు

ఇహలోకవిహారీ! బాటసారీ!
అనుభవం ప్రవాహం
అది అనంతం వైపే సాగుతుంది
లేకపోతే
కరడుగట్టిన కన్నీటిసమాధి
కాలానికి ఎప్పుడో ఖాయమై ఉండేది



# లో నారయ.....

మనిషి మామూలుగా మంచివాడే
మనసుపెడితే మరీ మంచివాడు
చందమామలా ఒంటరిగా నిలిస్తే
చల్లగాలిలా తీరంవెంట నడిస్తే.
కానీ
సమాజమై పరుచుకుంటే మాత్రం
ఎడారిలా ఇసుకమేటగా తేలుతాడు

కవిత మనస్సులో మహోన్నతశిఖరమే
ఎన్నెన్ని ఇంద్రధనుస్సులో  మెరుపులో
ఎన్నెన్ని చంద్రగుడులో పరివేషాలో
ముక్కారు పంటలో ముచ్చటైన జంటలో
ఎన్నెన్ని భావశబలతలో  శాంతిసంధులో
చెక్కిన శిల్పాలలో చెరగని సౌకుమార్యాలో..
కానీ
ముత్తెపు చిప్పలో కాలం కన్నీటి చుక్కలా
అక్షరాల నగిషీలు  చెక్కటంలోనే
ఆత్మార్పణలు అనివార్యతర్పణలు

తుమ్మెద కాళ్ళతో త్రొక్కినా
మార్దవానికి అంతరాలయమే కుసుమం
మనిషిచేయి పడితేనే వాడి రాలిపోయేది..

ప్రేమ మామూలు మనిషినీ
మహోన్నతుణ్ణి చేస్తుంది
పదిమందినీ పొదువుకుంటూ..
మహర్షినీ పతనం చేస్తుంది
తనను తాను అల్లుకుంటూ
తనువు దాటని తపనను నొల్లుకుంటూ

తపనే తరణతారణతపస్సు
ప్రకృతినీ పరవశింపజేయగలిగితే
తపస్సూ తపనగానే మిగులుతుంది
తలక్రిందులైనా తనవైపే చూసుకుంటుంటే

పైరులో నిరంతరం పచ్చదనం
పదిమందికోసమే కంకి
పాలుపోసుకుంటుంది కాబట్టి
అందుకే
ధాన్యవాచకాలకు ఏకవచనం లేదు
గింజలన్నీ ఒక్కటై ఎవరో ఒకరి ఆకలి తీరుస్తాయి
సస్యవాచకాలకు బహువచనం లేదు
అన్నీ ఒక్కటై అందరికోసం బ్రతుకుతాయి



## యుగళగీతం

ఈ విశ్వంలో
పుటక నందిన తొలిమానవుడు
మనలా ఏడ్చాడో
తనలా నవ్వాడో
మనకిప్పుడు తెలియదు
మనలో కలిసి మరుగైపోయిన
తనకూ తెలియదు
తనను తాను గుర్తించే లోపే
గతస్మృతులన్నీ
సన్నిహితవలయా లయ్యాయి

బహుశా ఏడ్చే ఉంటాడు
ఇంత విశ్వంలో
తానొక్కడే ఎలా బ్రతకాలనీ
ఇంత సంపదనూ
తానొక్కడే ఎలా అనుభవించాలనీ..

భూమిని చీల్చుకొని
రెండాకులతో పైకొచ్చిన గింజ
ఎక్కడలేని ఈర్ష్యనూ

పుట్టించే ఉంటుంది
తన ఒంటరితనానికి

నింగిలో పయనం సాగిస్తూ
నేలపై సుతారంగా వాలి
చినుకుగింజలు చల్లుకుంటూపోయి
మొలిచిన మొక్కల్ని చూసి
మురిసిపోయే మబ్బుముక్కను చూసి
ఈర్ష్యపడుతూ కూడా
ఎగిరి గంతేసి ఉంటాడు
ఎంత గొప్పజీవనమో అని..

తావులు పీల్చుకుంటూ నిద్రనాపుకుంటూ
పహారా ఇచ్చే పారిజాతాలు
గుండెల్లో నిండా చీకటి ఉన్నా
గుట్టుగా గుట్టలుగా పడి
దారిగుర్తులుగా మిగిలినా
బడలికలేని బండలూ కొండలూ
నిముషంలోనే రంగూ హంగూ మార్చుకొని
నిఖార్సుగా నిశ్చలంగా కదిలే మబ్బులు
అన్నీ ఒక్కటై అంతరాంతరాల్లో
అలజడిని ఆర్ధ్రతనూ ప్రకల్పించి ఉంటాయి

ఆనాటి తన ఆవిష్కరణం..
బ్రతుకు ప్రయాణం మాత్రమే కాదు
ప్రతికదలికా ప్రతిమజిలీ ఒక అనుభవం
అనుభవం మాత్రమే కాదు
ప్రతి అనుభవమూ పురోగతిలో ఒక అభ్యాసం
అభ్యాసమేనా కాదు
తెంపులేని అభ్యుదయం
ముగింపులేని ప్రకృతిపురుషయుగళగీతం..



# మహానటులమే...

అనుకుంటాం కానీ
అన్నీ చేయగలమా?
ఘటనలూ నటనలూ
కలగాపులగం అవుతుంటే
కల్తీలేకుండా కావిలించుకోగలమా?

గువ్వలా ఎగిరిపోవాలనుకోవడమే గానీ
గూటిని విడిచే ఆలోచనైనా చేయగలమా?
చెదరి చెదరి ఎటో పోయే తలపులను
వెదకి వెదకి చేతబట్టి చితక్కొట్టగలమా?

పంతానికి అలకబూని
కంచానికి దూరంకావటమే కానీ
ఆకలికి ఆవులింతలు దప్పించి
ఆప్రభాతం నిదురబుచ్చగలమా?

నీ దుంపతెగా అంటూ 'సరదాభాస'తో
కన్నబిడ్డలనైనా కసురుకోగలం గానీ
నిజంగానే దుంప తెగితే
గుండెదిటవుతో గుబుల్లేకుండా మనగలమా?

హరిశ్చంద్ర నాటకాన్ని చూస్తూ
ఆడితప్పకూడదని అనుకోవటమే కానీ
తప్పకుండా తడబడకుండా
వాయిదాలు లేకుండా
అడుగులేయగలమా మనం?

నేను పండితుణ్ణా? కానే కాదు..బాలుణ్ణి
ఇంకా నేర్చుకుంటూనే ఎదుగుతున్నా
అయ్యా ! మీ ముందు నేనెంత?
మన గురించి ఇలా మనమే పల్లవించగలం
మహావినయసంపదగా మాయచేయగలం
పరాయిచిలుక ఆ పదాలనే పలికితే మాత్రం
కినుకబూనకుండా కిలాకిలా నవ్వగలమా?

మనం మనంగా ఘనంగా బయటపడం కానీ
ఆలోచనలకూ స్కానింగూ
భావాలకూ ఎక్సరే లుంటే
ఇప్పుడే వస్తానంటూ వెళ్ళి
ఎప్పటికైనా మళ్ళీ రావాలనుకోగలమా?
తనువునే కాదు మనస్సునూ
ఆచ్ఛాదన లేకుండా ఆదరించగలమా?
ఆవకాయముక్కలా చప్పరించేయగలమా?

గుట్టులోనే గొప్పతనానికి గూడు
నగ్నత్వాన్ని
మట్టుపెడితేనే మరో మనిషితోడు
ప్రిపరేషన్ లోనే కంబైన్డ్ స్టడీ
పరీక్షవేళలో ఎవరి పరుగు వారిదే
తెరతీసేదాకానే నాటకకళాపరిషత్తు
తెరతీయగానే పరిషత్ రాజకీయాలే

అందరం మహానటులమై పోటీపడతాం
నందివిగ్రహాలు మాత్రం ఎటో వెళ్ళిపోతాయి.



# మహానుభావుడు

మహానుభావులు ఎక్కడో ఉండరు
మనమధ్యనూ
మనచుట్టూ
మనలోనూ
మన పరిసరాలలో
మన మనఃకుహరాల్లో
అజ్ఞాతవాసంలోనూ
ఆనందంగానే ఉంటారు

మత్తు ఉండదు
మగత ఉండదు
మసక ఉండదు
విసువు ఉండదు
వేసారే వేడుక ఉండదు
కొసరాడే కోరిక లుండవు

పూచే పువ్వును చూసి
పుణ్యదర్శనంగా భావిస్తాడు
రాలే పండుటాకులో
రసభావరాగాలు వింటాడు
తావి తరలిపోతుంటే

తానూ తోడు నడుస్తాడు
మనిషి మాయమవుతుంటే
ధ్యానంతో అన్వేషిస్తాడు

ఇసుకరేణువులోనూ
ఈశావాస్యాన్ని భావిస్తూ
తన్మయత్వంతో చూస్తుంటాడు
మసకచీకటిలోనూ
జగజ్జ్యోతినే మనసా స్మరిస్తూ
తలిరుజొంపమై తరిస్తుంటాడు

మబ్బుముక్కకు ముక్కు మొలిచిందంటే
పరుగెత్తుకొని వచ్చి నిక్కి నిక్కి చూస్తాడు
పిడుగుపాటుకు బ్రతుకు నేలగూలిందంటే
కారుణ్యమే తానై కలవరిస్తుంటాడు

పదిమందితో పాటు తానూ నడుస్తాడు
పదిమందికోసం తానూ నిలుస్తాడు
తనకే తెలీకుండా తాను స్పందించగలడు
మనకూ తెలీకుండా మనపని ముగించగలడు

అలిసిపోయినట్లు కనిపించడు
కలిసిపోయినట్లు అనిపించడు
పదిమంది మధ్యలోనూ తాను ఒంటరి

ఒకరి ఆపదలో తానే పదిమందికి సరి
వెన్నెల మూటగట్టి ముంగిట్లో విసిరినా
మందిమధ్యలోనే విప్పి అందరికీ పంచేస్తాడు
అయినా ఆ మహానుభావుణ్ణి మనం తెలియం
మరెవరో వచ్చి గుట్టు విప్పి చెప్పేదాకా
మనం విప్పి చెప్పినా కూడా తనకు తెలియదు
తనలో గూడుకట్టుకున్న తనమనతనం



# కలలు దాచుకుంటూనే ...

కాల మిలా గడుపుతున్నా

అల్లరల్లరిగా పగలంతా తిరిగి
ఆదమరచి నిదురిద్దామని
అమ్మ ఒళ్ళోనే పడుకుని
అటూ ఇటూ దొర్లుతుంటే
అమ్మమ్మ బెదిరించినట్టే
ముందరిముఖంతో వెనుకజుట్టుతో
బూచాడు కనిపించాడు
నాలాగే ఉన్నావ్
నువ్వెలా బూచాడి వయ్యావని
అడిగేలోపే మెలకువ వచ్చేసింది
ఆ కల అలాగే
అనుమానంగానే మిగిలిపోయింది
నేనూ బూచాడినేనా?

నాలుగక్షరాల చదువుకోసం
మూడుకాలువలూ బెరుకు బెరుగ్గా దాటి
కాలువ..కాలువమీద కాలువ..ఆపై మరో కాలువ
అసురసంధ్య దాటగానే
వణుకుతున్న కాళ్ళను

మంచంకోటి కదిమిపెట్టి పడుకుంటే
ప్రపంచమంత పెద్దపడవ కల్లో కొచ్చింది
ఎందరెక్కినా ఇంకా ఖాళీయే
ఆ కలనూ దాచుకున్నా ఆ పడవకోసం చూస్తూ
ఇప్పటికీ కాలువలూ వాగులూ వంకలూ
దాటుతూనే ఉన్నా బిక్కు బిక్కు మంటూ

ఉన్నదానితో సగమే తీరి
మిగతా సగం ప్రశ్నలవర్షం కురిపిస్తుంటే
ఆవేశం తెలీని ఆకలికి
సమాధానాలు వెతుకుతూ
అరకంటితోనే అలసి నిదురిస్తుంటే
కలలో భూగోళమంత అన్నంముద్ద
అసలది తరగటమే లేదు
ఎవరికెక్కడ కావాలంటే
అక్కడే తుంచుకుపోతున్నారు
తోపుడూ లేదు
ఎప్పటికో దాచుకునే దోపిడీ లేదు
ఆ కలలముద్ద నలాగే దాచుకున్నా
ఎప్పటికైనా అది
మాదిరిగా మిగలకపోతుందా
మరో ప్రపంచాన్ని సృష్టించేటప్పు డని..



# నా పసిరిక సిగ్గులు

సుప్రభాతసమీరతరంగాలు
నా శరీరాన్ని తాకి సవరించగానే
మంచానికి అంకితమైన తనువును
జాతికి పునరంకితం చేస్తూ
గోడవారగా నిలబడి
తోటలోకి తొంగిచూస్తాను
నా పసిరిక(పాము)పచ్చదనం
ఏ ఆకును సుసంపన్నం చేస్తోందో అని

అసలే క్షణం తీరికలేకుండా
అందరిపనులూ చక్కబెట్టే నాకు
ఇదొక అదనపు పని అయిపోయింది.

ఈ మధ్యనే
తెచ్చిపెట్టుకున్న తోటమాలితనంతో
పండుటాకులు సుతారంగా రాలుస్తున్న నాకు
చేతికంత దూరంలో హరితపత్రాల గేస్తుగా
ఆకుపచ్చకొమ్మను ఆసాంతం కౌగిలించుకొని
తొలి దర్శన మిచ్చింది ఉత్సవవిగ్రహంలా
నా తోటలోని పసిపసిరిక

నేనేం చేస్తానో అని దానికి భయం
అది కన్ను పొడుస్తుందని నా అనుమానం
ఇద్దరం నిశ్చలంగా..స్తబ్ధంగా
మొదటి అడుగు నాదే వెనుగ్గా వెనుగ్గా

మరునాడు మరో చెట్టుపై
ఆకులమాటున అణిగి మణిగి
రంగులో రంగు కలుపుకుంటూ
నా పాదాలసవ్వడి వినిపించగానే
పసిపిల్లలా సిగ్గుపడుతూ
పచ్చనాకులమాటున తలదాచుకుంది

రోజులు గడుస్తున్నాయి
దానిచూడటానికి నేను
నన్ను చూడటాని కది..నిజమా?
పువ్వు కోద్దామని నేను కొమ్మనందుకోగానే
నవవధువులా సిగ్గుపడుతూ
మరో కొమ్మపైకి ప్రాకుతూ
తలమాత్రం నావైపు త్రిప్పుతుంది
ఓరచూపులా..
ఒకరంటే ఒకరికి
భయం తీరిపోయింది

అప్పటినుండీ
నా అడుగుల అమరికలు
నా  చేతుల కదలికలు
దానికి కంఠోపాఠమైపోయాయి
ఏ కొమ్మ నెప్పుడు అనునయిస్తానో
దాని కిట్టే అర్థమైపోతోంది
నేను నిలిచిన మొక్కకూ
నేను తుంచబోతున్న మొగ్గకూ
నేను తాకబోతున్న తీవెకూ
తగలనంత దూరంగా..
నా కనుచూపు తప్పిపోనంత దగ్గరగా
ఆకులో ఆకుగా పచ్చదనపు సోకుగా
పరుచుకున్న మెత్తదనంలా పడుకొని
నావైపే చూస్తుంది నాజూకుకు భాష్యంలా
తనను తాకనందుకు తపిస్తున్నట్లు
నిష్ఠూరపుచూపులు విసురుతుంది
భామాకలాపంలోని సత్యలాస్యానికి
తాను జోడిస్తున్న మరో  ఆకులా
అవును..అదీ నాతోపాటే పెరిగినా
దానికీ పసితన మింకాపోలేదు నాకులాగానే



# అటో..ఇటో..కలిసే

మాట
వ్యక్తిత్వానికి కట్టినకోట
కోట బీటలు వారుతుంటే
మనిషి శిథిలాల మధ్య
శిలాఫలక మవుతాడు
దానికి ఉనికే కానీ ఊహ లుండవు
ఊసులు చెప్పిచా ఊఁ కొట్టలేదు
చరిత్ర చెప్పగల్గినా చైతన్య ముండదు

అద్వైతప్రవక్త కూడా
అంత్యక్రియలు చేసింది
అమ్మ కిచ్చిన మాటకోసమే
గుబురుచెట్టు కూడా ఆకులు రాల్చేది
శిశిరంతో చేసుకున్న ఒప్పందం కోసమే

క్షణానికో మాట క్షణానికో మార్పు..
నీ హక్కు నెవ్వరూ కాదనరు కానీ నీ
ప్రక్కన నిలబడదామని ఎవ్వరూ అనుకోరు
కాలంతోనే నేస్తంగట్టి కడదాకా సాగాలన్నా
కాలానికీ భయమే కాలదన్నిపోతావని

ఏడడుగులు కలిసి నడిస్తేనే
ఏడు జన్మల స్నేహాలు పల్లవించేది
ఏడు స్వరాలు కలిసి సాగితేనే
రాగతరంగాలు రసమయా లయ్యేది

ఏళ్ళు గడుస్తున్నా
అడుగులింకా బాకీపడితే
తూలిపడ్డ ప్రతీసారీ
తూర్పునుండీ చీకట్లు క్రమ్ముతుంటే !....

అందుకే చెప్తున్నా
నువ్వు ముందు నడు
నేను నీ అడుగులను అనుసరిస్తా
నువ్వు నన్ను అనుసరిస్తానంటే
నేను ముందుండి నడిపిస్తా....



# నన్ను తట్టి లేపరూ?

ఆనందగ్రంథినై అవతరించిన నేను
నన్నే మరచిపోతున్నా
మన్నుతిన్న పామునై
మసకచీకట్ల మాగాణంలో
అణువణువూ తడుముకుంటూ
అన్యాపదేశాలను ఆలకిస్తూ
అర్థాంతరంగా ఆవులిస్తూ
నన్ను నేను మరచిపోతున్నా

ఉషోదయప్రభావిభాతాలు
నిరంతర రంగస్థలంగా
జగన్నాటకాని కెన్ని
నాందీవాక్యాలు పలికినా
సంధ్యాకాల భరతవాక్యాలలో
నిరాశలను నిట్టూర్పులను
కలబోసి పదిలపరచుకుంటూ
చీకట్లలోనే సేదతీరుతూ
మత్తుగా పడి
మనుగడ కోల్పోతున్నా

చీకటి కావలి అంచు
విచ్చుకున్న వెలుగుపూల
నిరంతర వితరణలే

తనిసి తడిసిన ప్రకృతి
తన వంతుగా కల్పించిన ఈ న్యాయం
ప్రవచనాల హోరులో
అందరాని పండులా
ఆమడదూరం పారిపోయి
అక్కడెక్కడో
కంటిచూపు ఆననంత దూరంలో
నిలబడి వెక్కిరిస్తోంది
ఆనందమయకోశానికి
అంత తేలిగ్గా దారి కనరాదంటూ

నాకోసం
నేను అన్వేషించే ఆనందం కోసం
తలా ఒక నిర్వచనం చెప్పి
తలా ఒక భాష్యాన్ని వ్రాసి
గుండెనిండా ఆందోళననే నింపారు
ఆనందాన్ని అన్వేషించే క్రమంలో
నన్ను నేనే మరచిపోతున్నా
ఆనందగ్రంథినే నేనని...
నన్నెవరైనా తట్టిలేపి
గుర్తుచేయకూడదూ?
నాకు నేనే లేచి
అరుణకిరణంలా
విశ్వమంతా వ్యాపించేలోపు
ప్రవర చెప్పుకోటానికైనా
నన్ను నాకు జ్ఞాపకం చేయరూ? ★

# అష్టాదశపది

తన ఆయుష్షే తనకు నాలుగుయుగాల కాలం
తన ఉనికే తనకు పరమపదప్రమాణం
రెండుకాళ్ళపై నిలిచినా ఒంటికాలిపై కుంటినా
తన బ్రతుకే తనకు చెదిరిపోని  సాక్ష్యం

కాలానికి కాళ్ళుంటే గదా కదలిపోడానికి
దూరానికి గమ్యముంటే గదా చెదరిపోడానికి
తన కాలాన్ని తానే కొలవటం నేర్చుకోవాలి
తన దూరాన్ని తానే మాయం చేసి మనగలగాలి
తరులూ గిరులూ హిమఝరులూ తప్ప
కాలానికి సాక్ష్యం పలికే కథ లేమున్నాయని
నువ్వూ నేనూ వాడూ వీడూ తప్ప
దూరాన్ని చెప్పగల కొలత లేమున్నాయి

తన మనస్సే తనకు అసంపూర్ణసంవిధానలోకం
తన సరిహద్దులు తానే ఏర్పరుచుకోవాలి.
సుఖమైనా దుఃఖమైనా జననమైనా మరణమైనా
తన నిర్వచనాలు తానే లిఖించుకుంటూ
తన జీవితంతో తానే సమన్వయం చేసుకుంటూ
అనంతం వైపు అలా పయనిస్తూనే ఉండాలి



## *ఏమో!..ఏం జరిగిందో!..*

విహాయసంలో విహారయాత్రకై
అవనితలంపై అడుగులు మోపిన
తొలికాలపు పసికసి మనిషి
పుట్టీ పుట్టకముందే
మనలా ఏడ్చాడో
తనలా నవ్వాడో
మనకిప్పుడు తెలియదు
మనలో కలిసి మరుగైపోయిన
తనకూ తెలియదు
తనను తాను గుర్తించే లోపే
గతస్మృతులన్నీ
సన్నిహితవలయా లయ్యాయి

ఇంత పెద్దవిశ్వంలో
తానొక్కడే ఎలా బ్రతకాలనీ
ఇంత ప్రకృతిసంపదనూ
తానొక్కడే ఎలా అనుభవించాలనీ
ఆరడికి ఆలంబనమయ్యే ఉంటాడు

భూమిని చీల్చుకొని
రెండాకులతో పైకొచ్చిన గింజ

ఎక్కడలేని ఈర్ష్యతో
ఎదను నింపే ఉంటుంది
తన ఒంటరితలపులకు...

నింగిలో పయనం సాగిస్తూ
నేలపై సుతారంగా వాలి
చినుకుగింజలు చల్లుకుంటూపోయి
మొలిచిన మొక్కలన్నీ
తాను చల్లిన గింజలే అని
మురిసిపోయే మబ్బుముక్కను చూసి
ఎగిరి గంతేసి ఉంటాడు
ఎంత గొప్పజీవనమో అని..

కాచే కాయలు వీచే గాలులు
ఉరికే నదాలు ఉలికే పదాలు
కుదురుకున్న కొండలు
కుదురు వెదుకు బండలు
గుహలలోని మాయని చీకట్లు
గగనసీమ కన్నుల మిరుమిట్లు
అయోమయానికి గురిచేసి ఉంటాయి
జరాభయ మప్పటికి  పుట్టి ఉండదు

ఒకే ఒక కాటుకకన్ను
ప్రపంచమంతా పరుచుకుంటే

చుక్కలెన్నైనా
సురమా నలుసులై మెదులుతుంటే
అలాగే నిలబడి చూసుంటాడు
అంతర్ధానమయ్యే దాకా
తొలివెలుగుతీగ తీరం తాకేదాకా



# ఒక్కొక్కసారి అంతే

కారుమబ్బు కదలిక కూడా
కన్నీరే కురిసి వెళ్తుంది
వేగుచుక్క విహారం కూడా
విషాదగీతాలే పాడుతుంది

చెదపురుగులు కూడా
శ్రీకారాలు చుడుతుంటాయి
పాముపుట్టలు కూడా
మహర్షులను ప్రసవిస్తుంటాయి

మండు వేసవిలోనూ
నెత్తురు చల్లబడుతుంది
పండు వెన్నెలలోనూ
గుండె మంటలెత్తుతుంది

నిలువెత్తు మనుషుల్లోనూ
నిశ్శబ్దం తాండవిస్తుంది
దయామయుల చేతలలోనూ
కరకుదనమే కరుణిస్తుంది

ఆకాశాని కేసి చూస్తుంటే
అంతా నిండినట్టనిపిస్తుంది

పచ్చి గడ్డిపూవులు కూడా
నునుతావులు ప్రసరిస్తాయి

పడిమొలిచిన తుంగపోచలూ
వంశనాశనం కలిగిస్తాయి
మనిషికున్న వ్రేళ్ళూ కాళ్ళూ
గురుదక్షిణలకు పనికొస్తాయి

క్రిమికీటకసంహారాలు కూడా
మడిబట్టల గడు లవుతాయి
లెంకలైన జింకల తనువులూ
పూజలలో ప్రధాన మవుతాయి

పౌరుషాలు నిజపరహితానికై
కాంతల బ్రతుకులనూ కబళిస్తాయి
తృణచ్ఛన్నవాపీకూపాలూ
గుణగణనను నిర్దేశిస్తాయి

ఇటునుంచీ చూసే దృష్టికి
వింతవింతగా కనిపిస్తాయి
అటు చూడట మలవాటైతే
అది  మామూలే అనిపిస్తాయి



# ఎంతలా ఎదిగాడో!.....

అటు మృగమూ
ఇటు మనిషీ
ఒకే సెలయేటి నీళ్ళు త్రాగుతూ
ఒకే గలగలలతో
వీనుల విందు చేసుకుంటూ
ఎగిసిన నీటితుంపరలు
ఎటు ఎగిసినా తేరిపారచూస్తూ
ఎవరి తనువును తాకినా
నిలువెల్లా పులకరించిపోతూ...

అటు పులీ ఇటు మనిషీ
ఒకే కొండగుహకు అటూ ఇటూ నడుస్తూ
ఆహారమే లక్ష్యంగా ఇటూ అటూ చూస్తూ
లక్ష్యమూ ఒకటే ఏకాగ్రతా ఒకటే
బలాలు వేరైనా బలహీనత లొకటే
కాలు జారితే బ్రతుకు లోయలో
దృష్టి మారితే హృది కల్లోలంలో..

అటు ఆటా ఇటు వేటా
నదీతీరంలోని నాగరికతలో
కారడవులలో కాలిజాడలలో

చంపి తినటమే సజ్జనుల లక్ష్యం
తినకున్నా చంపితే అదే పాపకృత్యం
ఎంత ఎదిగి పోయాడో
అలనాడే ఆలోచనల్లో మనిషి
కంచెలు మంచెలు కట్టుకొని
అక్కడనే ఆగిపోయా డలసి

అటు మాటా ఇటు పాటా
కలుపుగోలుతనాన్ని కావిలించుకుంటూ
అలసిన  శరీరాలను ఆధునికీకరించుకుంటూ
వెన్నెలరేలలో వేడుకలూ వాడుకలూ
చీకటి చెలరేగితే చిదుగులతో సిరిమంటలు

ఒకే శ్వాసగా ఒకేధ్యాసగా
సహజాతాలను సమన్వయపరుస్తూ
ఉద్రేకాలకు ఊపిరుల నద్దుకుంటూ
చట్టుబండల చాటున చలినాపుకుంటూ
కట్టుటాకుల మాటున కథలు దాచుకుంటూ
ఒకే రీతీ ఒకే నీతీ
ఆత్మరక్షణకోసం అన్నింటినీ ఎదిరిస్తూ
అన్యరక్షణకోసం ఆత్మార్పణలు కావిస్తూ....



# జనాద్వైతం

నువ్వు...
నాలాగే జీవాత్మవో పరమాత్మవో
నేను ..
నీలాగే జీవాత్మనో పరమాత్మనో

జీవాత్మలమైతే జనంతో కలిసి బ్రతుకుదాం
పరమాత్మలమైతే జగతిలో  నిలిచి పలుకుదాం
రెండూ మనమే అయితే
జనాన్ని జగత్తునూ ముడివేస్తూ మురిపిద్దాం
అంతే కానీ
అటూ ఇటూ కాకుండా
అదో ఇదో తెలియకుండా
మన సందేహాన్ని
ప్రపంచసందేహం చేయట మెందుకు?
మన అకర్మణ్యతనే
మహావేదాంతంగా వల్లించట మెందుకు?

అద్వైతభావనతో ఆకలి తీరదు
ద్వైతం తలకెక్కినా దప్పిక తీరదు
అవి తీరితేనే గదా
ఆలోచనలకు లోచనాల నంటించి

అందినంతమేరా దర్శనం చేయగలిగేది
అద్వైతాన్నో ద్వైతాన్నో
ఆకుదొన్నెలలో పిండి
అందరమూ జుర్రుకోగలిగేది

అటు చూడు..
వేదాంతమహాసభలలో
నేతిఝారీల నుండీ నేయి వంపుకోడానికి
ఆకు దొన్నెలు అందజేస్తున్నా డొకడు
అడ్డంగా చిరగకముందే అరిటాకును కోసి
చిరగకుండా దింపి చింపులు చేసి
కడిగి ఆరబెట్టి
ఎండినాకును మళ్ళీ తడిపి
గోటిచిగురు గ్రుచ్చుకోకుండా
ఈనపుల్లలు చీల్చి చీల్చి
అదేం ఒడుపో ..అదేం మడతో
అంతలోనే దొన్నె ..అరచేతిలో వన్నె
ఆకు చిరగదు పుల్ల విరగదు

అది అద్వైతమో ద్వైతమో అడిగిచూద్దామా?
హార్డ్ వేరో సాఫ్ట్ వేరో ఆరాతీద్దామా?

పనిలోనే పరమాత్మ
పరవశిస్తూ నాట్యం చేస్తాడు

వనిలో కేకిలా ధ్వనిలో కాకువులా
అనర్ఘరత్నమై అందల మెక్కుతాడు
అయిదువ్రేళ్ళనూ అద్వైతం చేసి
శిల్పయోగాన్ని సృష్టించి చూపుతాడు
కణుపు కణుపులోనూ కళ్యాణకామనయై
ద్వైతంలోనూ దార్శనికతను ప్రదర్శిస్తాడు

నడక సరిగా ఉంటే పరమాత్మ ప్రకాశించినట్టే
నడత సరిగా సాగితే జీవాత్మ జిగేలుమన్నట్టే
జీవాత్మా పరమాత్మా రెండూ నువ్వే కావాలంటే
అవసరం నీదైతే వినయంతో జీవుడివై ఒంగు
అవసరం అందరిదైతే జనంలో పరముడివై పొంగు...



# కలతల కొలికి

హేమంతానికీ పచ్చపూలకూ
ఎందుకనో ఈ పరిసరబంధం
మండుటెండలకు తెల్లపూలకూ
తావులతో తరగని అందం
రంగురంగులకు రసమయగతులకు
ఎప్పుడు మొదలైందో అనురాగం
కవికోకిలలకు కోకిలకవులకు
ఎవడు కల్పించాడో పోలికల కలకలం

కాలానికి రుచీ పచీ తెలియవు
ఏ మొక్కనైనా కుసుమించమనే అంటుందది
అతీ గతీ లేని మంత్రజాలాల మాయతో
వెన్ను విరుచుకొని కూర్చుంటే ఏం చేస్తుందది?
ఎవ రడిగారని ఇన్ని కలల కథలూ కావిళ్ళూ
ఏం సాధించాలని ఇంకా కొత్త కులాలకు వేవిళ్ళు
మంచుముక్కలమీద మరణమృదంగాలూ
ఆరని మంటలపై ఆనందవిహారాలూ

ఉక్కుకిరి బిక్కిరైన ఊహలతో అపోహలతో
అనుదినమూ మమతల కవితల వలలా?
తలరాతకు కలవరపాట్లూ

కలనేతకు మురిసే మనసులూ
కురిసే ఏ మబ్బూ ఏ ఒక్కడికోసం కాదే
విరిసే ప్రతిపువ్వూ నీ నెత్తిన కిరీటం కాదే
ఉమ్మడి ఆస్తిలో నీ శ్రమఫలమే నీది
అనంతసృష్టిలో అణువణువూ నీదీ నాదీ

ఎత్తిపోతలకు దయతో లొంగటమే కానీ
పల్లంవైపు పారటమే నీటికి నైజం
ప్రపంచమంత సృష్టిని ప్రకల్పించి ఇచ్చినా
పుట్టా గుట్టా వాగూ వంకా కాయా పండూ
పువ్వూ తావీ మబ్బూ మంచూ నీరూ నిప్పూ
తోడుగా ప్రేమగా పలుకరించి పలవరించినా
ఏం ఊడిపోయిందనో ఏడుస్తూ బ్రతకటం
ఆకలి తీరకపోతే అనివార్యంగా ఒక ఏడుపు
ఆ కాస్తా తీరిందంటే అనుక్షణమూ ఏదో ఏడుపు

మనిషి కెవ్వ డిచ్చాడో ఈ తొలగని శాపం
విముక్తిమార్గాన్నీ మరిచాం ..ఇంకెవరిమీద కోపం?
కలుక్కు మన్న గుండెలోనే కాలానికి ఉనికి
కలివిడిగా నడుద్దాం పద అది కలతల కొలికి..



# రేపటికి బాసలు

నిన్న రాత్రి రెండో ఝాములో
రెండు కత్తుల్ని తినలేదు
నా పెదవులు కత్తిరించి
మీ వీపుకు అతికించలేదు
నా గుండెమీదా గుండుమీదా
సల్ఫ్యూరిక్ యాసిడ్ పోసుకోలేదు
నా నేత్రాలు సువర్ణఝషాలూ కాదు
అయినా కవిత్వం వ్రాస్తూనే ఉంటాను
నా చాదస్తం నాది మీ యోగం మీది
నా కవిత్వాన్ని వెర్రితనమంటే
గుర్రుగా మిమ్మల్ను చూసి
సకిలించటం నాకూ తెలుసు

విశ్వనాథకే విద్యలు నేర్పినవాణ్ణి
కృష్ణశాస్త్రికే కీలెరిగి వాతపెట్టినవాణ్ణి
శ్రీశ్రీ నా దెబ్బకు పడి ఇంకా లేవలేదు

అమృతం కురుస్తున్న రాత్రులలో
ఆనందంగా గడపండిరా అంటే
అనునిత్యమూ మెలాంకలీలు సెల్ఫ్ పిటీలు
నాస్టాల్జియాతో నానారభసలూ

ఆగని కన్నీళ్ళూ
తడి ఆరుతున్న మమతల మొలకలు
అంతా అయిపోయినట్టూ
అంత్యక్రియలే మిగిలినట్టు..
అసలే ఆత్మాశ్రయకవిత్వాలూ
దాని కిలా అదనపు ఆకర్షణలూ..

కురుస్తున్న చినుకు
కుమిలిపోవట మెప్పుడైనా చూశామా?
మదరమాగినపండు
మనకంటిని మాయచేయటం గమనించామా?
కొండల గుండెలు తొలిచి
బండమనస్సులతో విహరిస్తుంటే
అవెప్పుడైనా చలించిపోయాయా?
మొగుణ్ణి కొట్టి మొగసాలెక్కి ఏడ్చిందన్నట్టు
ఆలికన్నం పెట్టడమే ఊరికుపకారమన్నట్టు
అన్నీ మనమే చేస్తూ
అంతరంగాల్లో ఏమో అయినట్టు ఆక్రోశాలా?

నేలకోసం పోటీ నీళ్ళకోసం పోటీ
నిప్పుకోసం పోటీ నింగికోసం పోటీ
నిన్నమొన్ననే గాలికోసం
అంతర్జాతీయంగా ఆందోళన
దొరికినోడు మిగిలాడు

దక్కనోడు ఆట ముగించాడు
పంతభూతాల్లోనూ
మన వాటాలతో
బీటలు వారని వేమున్నాయి
అయినా  మనకు ఆర్తనాదాలే?
ఆత్మాశ్రయధోరణిలో ఆరున్నొక్కరాగాలే?

ఆకులో ఆకుగా పువ్వులో పువ్వుగా
చిదిమి చిద్రుపలు వెదజల్లే
అఖండానందస్వరూపంగా
అరక్షణ మైనా బ్రతకలేమా?
ప్రహర్షవిజయవైజయంతికను
గగనసీమలో రెపరెపలాడించలేమా?
మనతరం మసకబారలేదని
భావితరాలకు బాసలు చేయలేమా?



## నీటిపోత

ఆరోజు
ఆకాశమంతా అల్లకల్లోలం
మూడురోజులు ముందునుండీ
గగనతలం సన్నద్ధత
కాటుకకొండను పిండిచేసి
ముంగిలంతా పరిచేసింది
కాలపురుషుని కంకాళాల
కరాళనృత్యం చూడాలని
మబ్బుల త్రొక్కిసలాట
కలుస్తూ కనుమరుగవుతూ
కురుస్తూ కులుకులుపోతూ
గగనసీమలో  గారడీవిద్యలు
గుంపులు గుంపులుగా మొయిళ్ళ ఘర్షణ
రాసుకోవటం పూసుకోవటం
ఎప్పుడో మానేశాయి
ఇప్పుడు నెట్టుకోవటం కొట్టుకోవటమే
ఏ భాషలో తిట్టుకుంటున్నాయో కానీ
అందరూ తలెత్తి వినేట్టు చేస్తన్నాయి
వినలేనివాళ్ళు చెవులు మూసుకొన్నారు
అపభ్రంశపు పదాలు అడ్డుతగిలాయేమో!

కాలమేఘం కంటబడ్డప్పటినుండీ
కంటినిండా నిద్రలేని కన్నతల్లి కథ
తలుపులు తెగి కాలు విరిగి
ఒరిగి ఒయ్యారంగా వాలిన
చెక్కబీరువాలో
నక్కి దాగిన సత్తుగిన్నెలు
ఆ పూటకు గట్లు నెఱియలువారిన
చెరువులను ఆవాహన చేసుకొని
సేద దీరుతూ చలికి వణుకుతాయి
ఒళ్ళంతా సీతాఫలంలా నొక్కులైనా
అడుగుభాగ మింకా ఊడిపోని వైనం..
జరత్కారుని పితరుల జీవితాశలు
ఆ గిన్నెల్లో కలలు కంటుంటాయి

ఇంటికప్పు తాటాకులో
తరులక్షణాలు తరిగిపోని స్థితి
ఆకులమధ్య అలా కురుస్తూ..
గిన్నెల్లో  ఆగి ఆగి పడుతున్న
తేనెరంగు నీటిబొట్లను
లెక్కబెడుతూ
కాలం-వేగం ఆటాడుకుంటున్న
కల్లాకపట మెరుగని పిల్లలు
గిన్నె నిండకముందే

వాన వెలిస్తే బాగుంటుందని
కన్ననేరానికి కలవరపడే తండ్రి

ఏణ్ణర్థం కూడా పూర్తికాని
చంటిపాప చుట్టూ చాలా పొత్తిళ్ళే
అయితే ఏం
కురవటమే కానీ తరచటం
వానలు నేర్వని విద్య
ఉటియటమే కానీ ఊసులాడటం
గుడిసెకు నేర్పని విద్య
చీరకొంగు చిరుగులోనుండీ
పాప తలపై పడి చినుకు
అపరాధభావనతో పతనమైంది
నిలువెల్లా గగుర్పాటు చంటిపాపకు
మనసంతా సలపరింత మాతృమూర్తికి
అటుతిరిగి పడుకుంది
బిడ్డను పాతగుడ్డల్లో పొదువుకుంటూ
మళ్ళీ కారబోతున్న బొట్టుకు
అందనంత వేగాన్ని అదుముకుంటూ

అయినా  జోరుతగ్గినా కురుస్తూనే ఉంది వాన
నారుపోసిందెవరైనా నీరు పోయవలసింది తానేగా



# ఆటాడుతూనే ఉందాం

మనలోని బ్రతుకుబెదురు
రేపటివారినీ భయపెడుతోందేమో!
విడుదలకై పెనుగులాట
మనవళ్ళనూ బెదరగొడుతోందేమో!
అందరిలో మోక్షప్రేమ
హఠాత్తుగా పూచి ఫలిస్తే
పాపం పరమాత్మకు ఎంత నిరాశ!
బ్రతకటం చేతకాని
బకరాలను సృష్టించినందుకు
ఎంతెంతగా కుమిలిపోక!

మనమే వ్రాసుకున్న కథల్లో తప్ప
మరెక్కడా ఏ ప్రాణీ
బ్రతుకు  భారమంటూ
అంగలార్చటం లేదే!
మనమే గీచుకున్న యంత్రాల్లో తప్ప
మరెక్కడా ఏ దేవతా
మట్టసంగా దిగులుగా
ముడుచుకొని కూర్చోవటం లేదే!

ప్రకృతి పరుచుకుంటుంది
పరమాత్మ ప్రాకుతుంటాడు
విస్తరిస్తాడు వినోదిస్తాడు
వికసిస్తాడు విలపిస్తాడు
మొలుస్తాడు మొక్కవుతాడు
ఆకుమీద మంచుచుక్కవుతాడు
చుక్కమధ్యలో వెలుగవుతాడు
ఆవిరయ్యేదాకా ఆనందమవుతాడు
పండబారిన బ్రతు కవుతాడు..

ఫలరసమై తానే పరవశిస్తుంటే
మధ్యలో మనకెందుకు?
పరగడుపుతో పారిపోవడాలూ
పండుజీవితాలకు అడ్డంపడే
పదపదార్థవిన్యాసాలూ.....

కాలగతితో పోల్చి చూస్తే..
అద్వైతం పుట్టి ఆరురోజులు కాలేదు
విశిష్టం వెలిసి రెండురోజులూ కాలేదు
ద్వైత మంటామా దానికి కొంచెమిటు
తెలిసినా తెలియక పోయినా
ఏదో ఒక ముద్ర
అందరిమీదా పడవలసిందేనా?

తొలిపలుకులన్నీ అంతకు ముందువే
ఉపనిషత్తులూ ఇతిహాసాలూ పురాతనాలే
సూత్రాలూ గోత్రాలూ అలనాటి వాటికలే
బ్రతుకును బ్రతుకుగా బ్రతికితే
అన్ని తత్త్వాలకూ ఆదర్శభాష్య మదేనే
మార్గాన్ని పదిలపరచుకున్న మీదట
మలుపుల గురించి ఆందోళన లెందుకు?
బ్రతకటమే లక్ష్యమని తెలిశాక
పారిపోవాలనే పట్టుదల లెందుకు?

శుక్తిలో పడి బ్రతకకపోతే
చినుకు ముత్యమెలా అవుతుంది?
మమతలో పడి నలగకపోతే
మనసు మాలిమి ఎలా అవుతుంది?

సంఘమే తానై
ఆయనే పులకరిస్తుంటే
సంఘాన్ని వదిలి
ఆయనలో కలవడ మేమిటి?
ఇక్కడే బ్రతుకుదాం పూర్తిగా
పూర్తిగా ఆట ముగిసేదాకా
తానే గెలుస్తాడో ?
మనలనే గెలిపిస్తాడో ? ★

## *ఔననే అందామా?*

ఈ కవులెప్పుడూ ఇంతే
తామే మవుతారో చెప్తారే కానీ
మనమేం కావాలో చెప్పరు

పువ్వు నవుతానని ఒకడు
పెదాలపై నవ్వు నవుతానని ఒకడు
కవిత్వ మవుతానని ఒకడు
కాలక్షేప మవుతానని ఒకడు
ఆశలనే శ్వాసిస్తానని ఒకడు
అగాథమై ఘోషిస్తానని ఒకడు...

అయినా సరే
సర్దుకుపోదామనుకుంటే
మీ ఆకలికి
అన్నమవుతానని ఒక్కరూ అనరేం?
మీ హృదయానికి
కవచమవుతానని ఎవ్వరూ పలకరేం?
మీరు పిలిస్తే
ఎక్కడున్నా పలుకుతామని మాటివ్వరేం?
మీరు తలిస్తే
కోటిదేవుళ్ళమై నిలుస్తామని బాసాడరేం?

ఏది లోటైతే
అది మేమే అనరేం దుష్యంతుడిలాగా?
ఎవరు శాసించగలిగినా
లొంగి ఉంటా మనరేం పరమశివుడిలాగా?
విదురుడిలాగా
విశ్వరహస్యాలు వినిపిస్తాడే కానీ
అడుగు కూడా కదపడేం అక్కడనుండీ?..

కౌగిలిలో
బందీ నవుతానంటాడే కానీ,
బాధలలో
బంధ మవుతా ననడేం?
ఏడు జన్మల బంధమూ
తానే అంటాడు కానీ
ఈ జన్మకు
నీ బాధ్యత నాదే అనడేం?

కలల్లో అయినా కవితల్లో అయినా
మాటలే కోటలు దాటుతుండాలేమో!
మనుషులనైనా అయినా
మనస్సులనైనా అయినా
అహంకారమమకారాలే
అల్లుకుపోతుండాలేమో!
సమాజానికి తలమానికాలమై

నాల్నాళ్ళైనా బ్రతుకుదాం
మీసం మెలేద్దాం అందర మొక్కటై
దరహాసాలను రాశులు పోద్దాం..
పంత మదొక్కటే..



# పాలపొంగు

మెల్లమెల్లగా వేడికి లొంగిపోతున్నా
ఒళ్ళంతా పొంగుచేసుకుంటాయి పాలు
మౌనంగానే నిశ్చలంగానే ఆరంభిస్తాయి ఆట
క్షణక్షణానికీ కణకణంలోనూ
తెలిసీ తెలియని ఆవేశం
ఆదికవిలోనూ అవతరించని
అలవిమాలిన ఆవేశం
మధ్యలో త్రుళ్ళింతలూ చుట్టూ పులకింతలు

తెలివెన్నెలతరకలను ద్రవీభవించి
కెలికి చిలికి తీసినట్టున్న నురగలు
గుండ్రటి సరిహద్దుగోడలను
అణువణువుగా అతిక్రమిస్తూ అధిరోహిస్తూ
మధ్యలో త్రుళ్ళింతలనూ మాయం చేసి
అంతా పొంగై ఎగిసెగసిపడుతూ
ఎంత వేగమో ఎంత ఆవేగమో ఏమో
ఆత్మహత్య కొడిగట్టే జలపాతంలా
చేయి కదిపే లోపే అంచులు దాటి
ఆత్మాహుతి చేసుకొంటాయి
నిప్పు నార్పి పగతీర్చుకొని
ఆవిరిగా మారి పొగమబ్బుగా

కనుమరు గవుతాయి
పాత్ర శూన్యమై చల్లబడి
క్షీరావశేషాలకు సాగిలపడుతుంది

మెల్లగా కాగి మీగడై
లేతగులాబీరంగును గుత్తకు తెచ్చుకుంటే
పదిరోజులైనా పదిలంగా
రూపం మారినా సగర్వంగా
నేతిచుక్కగా మారి
నిన్నూ నన్నూ కడతేర్చగలిగేవి
పేరినరూపంతో
పిల్లల మనస్సులూ చూరగొనేవి

ఆవేశంతో మరిగిపోతే అంతే
పాలపొంగైనా కవిత్వపు హంగైనా
చిక్కుముళ్ళు పడ్డ దారపుండలాగా
కవిత్వ మైనా జీవితమైనా
అక్కడక్కడే చుట్టలు చుట్టుకుంటుంటే
ముడి మీద ముడిగా మూడు దాటిపోతుంటే
అందవలసిన అనుభూతీ ఆర్తీ ఆవేదనా
ఏ ముడి క్రిందో నలిగి నావనష్టం కావా?

ఆవేశపడాలి అంతరాంతరాలు రగిలేటట్లు
కవిత్వమైపోవాలి మనలో ఏమీ మిగలనట్లు

పాలపొంగులా అణువణువూ కదలాలి
కదలిక లన్నీ ఒక్కటై పొంగునే పొంగించాలి
కానీ
ప్రతిపదమూ పొంగుతుంటే
భావం భంగపడి ఆవిరవుతుంది
అంతరిక్షంలో ఆస్ట్రోనాట్ లా
గాలిలోనే తేలుతూ ఉంటుంది
ప్రతికొమ్మా  సొంతంగా సాగుతుంటే
తరువు కూడా బరువెక్కి
ధరణికి దిగజారుతుంది



## కాలగీత

కాలెండరంటే భయం
జరిగిపోయిన ప్రతిక్షణానికీ
లెక్కలు చెప్పమంటుం దది
సాధించినదాన్ని చూపించమంటుంది
చివరిక్షణంలో కూడా చిరాకుపడుతూ
కేటాయించిన మొత్తం రోజుల్లో
వాడుకున్నవెన్నని నిలదీస్తుంది
మిగిలిన కాలానికి
రాబోయే బడ్జెట్లో కోత విధిస్తుంది

తెగతెంపులు చేసుకొనే శిశిరం
తెల్లవార్లూ  కన్నీరు కార్చినట్టు
బంధాలు తెంచుకొనే ముందు
కాలెండర్ తో భేటీ తప్పదేమో అని
కొత్తయేడాది పండుగలన్నా
నాకు భయమే

చెదరిపోయిన శరచ్చంద్రిక
మరో వసంతంతో మళ్ళీ అలరిస్తుంది
జారిపోయిన హేమంతం
మరో వసంతం గడిచాక

మళ్ళీ పసిమిగా కుసుమిస్తుంది
జారిపోయిన కాలెండర్ మాత్రం
జాతి జాతీ కన్నీరు మున్నీరైనా
అవతారమూర్తిగా
అనుగ్రహిస్తుంది తప్ప
వినోదంకోసమైనా
వెనుకడుగు వేయదు

అలసిపోయిన ఋతువులన్నీ
ఆదమరిచి నిదురించినా
విశ్వమంతా విషాదమహాకావ్యమై
మనుషులను మూర్ఛిల్లజేసినా
విధివిలాసాలనూ వెక్కిరిస్తూ
విధిగా అది ముందుకే సాగుతుంది
అదే ..అదే అది నాకిచ్చే ధైర్యం
ప్రక్కమనిషి సణుగుడు
ప్రగతిశీలురకు పట్టదు
సూటిగా దూసుకుపోయే బాణం
ప్రక్కచూపులతో పతనం కాదు

కాలెండర్ సాక్ష్యం చెప్తేనే
మన మెలా ఎదిగామో తెలిసేది
అది సంతకం చేసి అనుమతిస్తేనే
మన జీవిత మసలు మొదలయ్యేది

కాలెండర్ లో తప్పులు దొర్లినా
కాలం గతిని మార్చుకోదు
చినుకులు శిలల తునకలై
శివాలెత్తి చిందులు వేయవు..
జననమైనా మరణమైనా
కాలగీతకూ కాలెండర్ కూ
ఎటువంటి మొహమాటమూ ఉండదు..



## నైజం

అమాసనాడు
వెన్నెల విరియలేదన్నా
చల్లదనం కురవలేదన్నా
మచ్చబడ్డ చంద్రుడు
మన ముందుకు రాలేదన్నా
అలమటించటాని కేముంది?
తమాలవృక్షాలనూ తలదన్నే
అలవాటైన చీకటి కాటుకకొండ..
అక్కడక్కడ ఒక మిణుగురుపురుగు..
చేతిలో లాంతరుతో చిరుప్రయాణాలు..
వినియోగపథంలో శర్విలకుల జంఝూలు..
కునుకు తీసినకళ్ళలో
కొలువు తీరిన శతకోటిస్వప్నాలు

కానీ పున్నమిరేయి మబ్బు క్రమ్మి
జాబిల్లి జాడే కనరాలేదంటే
నొచ్చుకోకమానం
కాలం కుబుసం విడవలేకపోతోందని
కలతలా విచ్చుకోక మానం
చంద్రుడే నింగిలో చతికిలపడ్డాడో

గగనమే నేలగూలి సొమ్మసిల్లిందో
ఒకటే ఆరాటం.. ఒకటే ఆందోళన
“పడిపోయిన సూర్యుడు
పైకి లేస్తాడేమో!”

మల్లె నల్లబారితే
మనస్సు మథనలో పడుతుంది
చినుకు శిలాజమైతే
పొలం పలకబారటం మరుస్తుంది
నూత్నవిగ్రహాల నావిష్కరిస్తేనే
నునుపుదేరిన మట్టి
నోములు పండించుకుంటుంది.

ఏదైనా అంతే
తాను తానుగా ఉంటేనే
తరతరాలకూ విలువ
చీకటి చిద్రుపలైనా
వెలుగు వెల్లువలైనా
రంగులు మార్చటాని కవి
ఊసరవెల్లులు కాకూడదు
మహాకాశమైనా ఘటాకాశమైనా
అణువులు అడ్డంగా నిలవడమే కానీ
ఆంతర్యం తొణకదు

చేయి లోపలికే సాగితేనే
సిద్ధహస్తం కాగలిగేది
కాళ్ళు ముందుకు కదిలితేనే
కదంత్రొక్కుతూ పరుగెత్తేది
కురిస్తేనే మబ్బు విరిస్తేనే పువ్వు
తరిస్తేనే తరువు విరిస్తేనే నవ్వు
నిశ్చలంగా గుండె నిలిచిందా
జీవచైతన్యానికి అదే చివరి అలుపు
నిర్మలంగా జనమంతా నిలిచారా
విశ్వచైతవ్యానికి అదే తొలిగెలుపు



## *రాతిరంటే నాకిష్టం*

నిన్నటికి అంచు
నింగిపై పరచుకున్న
నల్లంచు నల్లచీరంటే
మీతోపాటు నాకూ ఇష్టం..

కళ్ళు పగలంతా కన్నీళ్ళ కావళ్ళైనా
రేయి కునుకుతీసే వేళకు
తమోదీపాల తరలింపులై
రెప్పల పొత్తిళ్ళలో పసిపాపలై
అంతర్దర్శనంతో అలసిన శిలలై
స్వయంసంచాలితశిల్పస్వరూపాలై
రాబోయే రేపటిసంబరాలతో
రహస్యాలు పంచుకుంటూ సోలుతాయని

పగలంతా కుదిపేసిన భయాలు
చీకటి విరుచుకుపడగానే
వాటంతటవే కరిగి కనుమరుగై
తెల్లారేసరికి స్వాప్నికప్రత్యక్షాలై
సప్తసముద్రాల కావల
మర్రి చెట్టుతొర్రలో చిలుకలా దాక్కొని
అదృశ్యంగా నిలిచిపోతాయని

ఆ చిలుకను చిరంజీవిని చేస్తాయని
పగలంతా జోస్యాల పలకరింపులలో
వాస్తుశాస్త్రాల వెక్కిరింపులలో
సంఖ్యాశాస్త్రాల సతాయింపులలో
చైనా గంటలలో అద్దాల అమరింపులలో
రత్నాల రహదారుల్లో రుద్రాక్షల ఎంపికలో
బ్రతుకు భయమై ఆందోళనకు జయమై
ఆశలు ఆవిరియై భవిష్యత్తులో లయమై
నలిగి నలిగి నిలద్రొక్కుకోలేని మనసు
ఏ ముహూర్తమూ ఏ దిక్కు ఏ దెసా
ఏ తలగడ తీరూ ఏ దుప్పటి జోరూ
ఏమీ కుదరకపోయినా
యాదిమరిచి నిదురిస్తుందనీ
లోవెలుగు చూపినట్టే
లోకాన్ని చూస్తుందనీ
సుషుప్తిలోనే సేదతీరుతుందనీ

అంతే మరి..
పగలు విరిగినా నొగలు ఒరిగినా
ముగింపు ముచ్చటగానే ఉండాలి గదా!
తొలి కలతలకైనా మలి కవితలకైనా...



## మనిషి - నిలువుకోత

ఆకు అడ్డుకోత అంటూ
విజ్ఞానశాస్త్రపాఠాలలు విన్ననాటినుండీ
నా కొకటే ఆరాటం
మనిషి నిలువుకోత పాఠం చెప్పుకోకూడదా అని.

కోతపడగానే జరాసంధులు కంటబడతారేమో
కృష్ణుని మార్కు రాజకీయాలను
ముందే ఒంటబట్టించుకోవాలి
మరో సృష్టికై ఉద్యమించే
విశ్వామిత్రకణం కనిపిస్తుందేమో
త్రిశంకుస్వర్గం చిరునామా
తెలిసిపెట్టుకుంటే మంచిది..

ఆశ్రయమిచ్చినవారి ఆఅడి పుచ్చుటానికి
కొడుకును పంపుతున్న కుంతిమనోబలానికీ
కుంతినే మందలించిన ధర్మరాజవిజ్ఞతకూ
ఏ కణాలు కారణమో వెతికిపట్టుకోవాలి
ధర్మజుని మాటలు కంఠతా పట్టి ఉండాలి

ద్రుపదుని హేళనచేసే ద్రోణుడు
ద్రోణుని ఎదిరించే కర్ణుడు

కర్ణునిపై కత్తిగట్టిన అశ్వత్థామ
అశ్వత్థామ పీచ మణిచిన కృష్ణుడు
కృష్ణుని బంధించే సుయోధనుడు
సుయోధనుని ప్రేమించే బలరాముడు
బలరాముడికి ఒదిగి ఉండే కృష్ణుడు
ఏ క్షణాల కలగాపులగమో గమనించాలి
వాళ్ళు అడగబోయే ప్రశ్నలకు
ముందే భాష్యాలు వ్రాసిపెట్టుకోవాలి

శకుంతలను ఒంటరిగా విడిచి
కణ్వుడు సోమతీర్థానికి వెళ్ళిన వైనం
అంతా తెలిసి అలా చేయటానికి
ఏ క్షణం కారణమో గుర్తించాలి.

వేదాల్లో విజృంభించిన ఇంద్రుడు
పురాణాల్లో ఎందుకు చతికిలబడ్డాడో చూడాలి
నిప్పంటే మనం భయపడిచస్తుంటే
ఆరనికుంపట్లను ఇంట్లో పెట్టుకొని
నిమ్మళంగా ఎలా ఉంటారో నిత్యాగ్నిహోత్రులు!
క్షణవిచ్ఛేదన చేసి అయినా అర్థంచేసుకోవాలి

ప్రక్కవాడంటే పడకపోవటానికి
ఏ క్షణం మూలకమో వెతకాలి అదేపనిగా

అందరూ అదిరి చచ్చే అపెండిక్స్
ఏంచేయడానికుందో దాన్నే అడగాలి.

దానకర్ణుల చేతికి ఎముక ఎందుకుండదో!
వీరకర్ణుల మెదడులో వివేక మెందుకుండదో!
అంతలావు భీష్ముడూ అలా కర్మసాక్షిగా
ఎందుకు మిగిలిపోయాడో ఎరుకలకణాన్ని అడగాలి

ఇన్నికణాలనూ లోనపెట్టుకొని
ఏమీ ఎరగనట్టు నటించే చర్మాన్ని
తాకి మరీ అడగాలి
ఇంత దాపరికం ఎక్కడనుండీ వచ్చిందని..



# ఏ పుట్టలో ఏ పాముందో?

అటు పరవళ్ళు త్రొక్కుతూ పరుగులు పెట్టే నది
ఇటు హైలెస్సా పాడుతూ పడవనడిపే పడుచుది
చుర్రుమనిపించే సూదులు గ్రుచ్చుతున్న దినమణి
జటామకుటతేజస్సే వలయమై జ్వలించే తపఃఖని

ప్రకృతిలో ఒక పులకింత ఒక ప్రణయవీచిక
మునిహృదయంలో అనుద్విగ్నమై వలపుల పాచిక
మనోబుద్ధిసంఘర్షణలో గెలిచిన ఒక కామన
అనాదిజీవనసూత్రానికి ఒక అనుగ్రహభాషణ

జాతిజాగృతిగీతానికి ఒక అరవిరిసిన పల్లవి
మహోజ్జ్వలవాఙ్మయానికి ఊదిన తొలి ఊపిరి
తపోబలవిస్ఫోటనం..ఒక సౌరభసారప్రవాహం
దిక్కులన్నీ కప్పిన ఒక తమోమయయవనిక

ఒక పడవపిల్ల
వ్యాసమహర్షికి తల్లి అయింది

ఒక మహారాజు మనస్సులో అవధిలేని మదనఘోష
గుండెలపై కొలిమికాక గుట్టునసలు దాచలేక

తండ్రిని తరచి తరచి తరచి ప్రశ్నించిన తనయుడు
మనసు దాచి తనయునిపై విసిరిన ఒక మమతల వల

కన్నతండ్రి పెండిలికై తనయుని భీషణయత్నం
రాజ్యంతో పాటు స్వీయజీవితమూ శుల్కం
పెళ్ళికొడుకుగా తండ్రిని చూసిన తొలి బిడ్డడు
ఆ ఇద్దరి అంతరంగ మవురా! ఎరుగున దేవుడు?

ఒక దాశరాజు హృదయంలో భవిష్యత్తు మీద ఆశ
తన గతితార్కికభౌతికతకు తలవంచిన రాచరికం

సత్యవతికి రాచఠీవి తలపై ఒక మేలిముసుగు
శంతనుసతిగా జీవననౌకాగతిసంచలనం

ఒక మహారాణికి
విచిత్రవీర్య చిత్రాంగదజననం

కన్నతండ్రి కళ్యాణానికి కానుకగా కొడుకు బ్రతుకు
పితౄణం అలాతీరి ప్రకృతిగతి కొంక అతుకు
సుతఋణవిముక్తికోరి కన్నతండ్రి కలవరం
ఎందుకు ఇచ్చాడొ ఏమో స్వచ్ఛందమరణవరం?



# ఆనవాళ్ళు

మేఘంలోని ఆర్ద్రత జత కలిస్తేనే
మెరుపు మెలికలు తిరిగి మెరిసేది
గుండెల్లో స్నిగ్ధత గురి తప్పనప్పుడే
కవిత రసార్ద్రమై రవళింపగలిగేది

పడమటిగాలి నిప్పులు గ్రక్కుతుంటే
మంటలే గానీ మెరుపు లుండవు
గుండె కొలిమిలా కునారిల్లుతుంటే
కల్లోలాలే కానీ కవితలు పండవు

నిన్న విడిచిన కుబుసాన్ని
నేడు ఏ పామూ పట్టించుకోదు
మొన్న కాసిన వెన్నెలలతో
ఏ మనస్సూ వెల్లవేసుకోదు

రాళ్ళ నెంతగా బ్రద్దలు కొట్టినా
రక్తపు మరక లెప్పుడూ ఉండవు
వేళ్ళ నెంతగా త్రవ్విపోసినా
చివురుటాకు లెప్పుడూ పుట్టవు

ఎడారి ఒంటెల్లా ఎంతదూరం నడిచినా
గుండెలు పిండుకోవటమే కానీ
గ్రుక్కెడు నీళ్ళు దొరకవు
రాదారిపడవలా ఎన్ని జన్మలు గడిపినా
తీరాలు కలపటమే కానీ
తేమలోని తీరుతీయాలు తెలియవు
తొలకరి తడితో పరవశించకపోతే
మట్టివాసనా మనసు దాకా రాదు.

ఆర్ద్రత అంతరించిపోతుంటే
ఆవిర్లే అహర్నిశలూ
మబ్బు తునకలై మలల కెక్కేదాకా
ఆక్రోశాలే ఆనవాళ్ళు...



# సమాజం ఒక ప్రతిధ్వని

మాట వినేదే
మనదే
మనసుతో నడిచేదే
మనం రూప మిచ్చిందే
ఈ సమాజం..

సుడిగుండాలూ సృష్టిస్తుంది
సుమగంధాలూ కురిపిస్తుంది
పచ్చనాకు సాక్షిగా
పశుత్వం ప్రకటిస్తుంది
ఎండుకొమ్మల మీద ఒట్టుపెట్టి
లేజివురులు ప్రసవిస్తుంది.

అంత చెడ్డదేం కాదు

అందరినీ అలరిస్తుంది
అందరితో విలపిస్తుంది
అందరినీ బెదిరిస్తుంది
అందరికీ అదనిస్తుంది
అందరిలో అలుసవుతుంది

అందరికీ బలుపవుతుంది
అనుకుంటాం గానీ
మనలో ఎవరం మాత్రం చెడ్డవాళ్ళం?

బిగ్గరగా ఆలోచించే సాహసం చేయగలమా?
దగ్గరగా బుసకొట్టే ధైర్యం చేయగలమా?
మడతలు లేకుండా మాటాడగలమా?
మమతల బలహీనతలు మరిచిపోగలమా?

మందహాసాల మాటున
మనస్సును కప్పిపుచ్చడం లేదా?
అలవోక అబద్ధాలతో
అంతరంగాన్ని అణచిపెట్టడం లేదా?
లౌక్యం పేరు పెట్టుకొని
ప్రతిక్షణమూ చచ్చి బ్రతకటం లేదా?

అయినా సమాజం భరిస్తుంది
తప్పని పరిస్థితిలో తప్పుకొని భరిస్తుంది
నప్పిన పరిస్థితిలో ఒప్పుకొని భరిస్తుంది.

ఆకులనే పూలుగా భ్రమింపజేసే
బోగన్ విల్లా మన సమాజం

పూలు లేకపోయినా ఫలించగల
వనస్పతి మన సమాజం
తాను అలా సాగుతూనే ఉంటుంది
అందరి అంతరంగాలకూ దీపమై నడుస్తూ
తానలా మ్రోగుతూనే ఉంటుంది
అందరి గుండెలలో అవిశ్రాంతంగా మార్మోగుతూ...



# దేవుడు చెక్కిన శిల్పాలు

ఒక గిరి ఒక ఝరి
ఒక నర్తనసుందరలహరి
ఒక కరి ఒక దరి
ఒక సురభిళసుమమంజరి
ఒక లత ఒక కత
ఒక పరివర్తితమానవత
ఒక వని ఒక ధ్వని
ఒక రసపరిమళభాషావని
అన్నీ ఆ దేవుడు చెక్కుకున్న
సుస్నిగ్ధసుందరశిల్పాలే
ప్రకృతి పరవశించి పరిమళించి
ప్రసవించిన మధురఫలాలే
అనాదులై అనంతంవైపు
అలా నడుస్తున్న కళాకృతులే
తపించి తరించి సంతరించుకున్న
సజీవప్రతిభకు సాక్షాత్తు నిదర్శనాలే

కానీ మనం
మెదడులో గడుసుతనంతో పుట్టినవాళ్ళం
కొండలను నంజుకొని తింటున్నవాళ్ళం
కొమ్మలను విరిచి వెదజల్లుతున్నవాళ్ళం

నదీగతుల నాపి నిండా మునుగుతున్నవాళ్ళం
విన్నవించటమే కానీ వినిపించుకోనివాళ్ళం

దేవుడు చేసిన శిల్పాలనే చితక్కొట్టి
దేవుడిశిల్పాలనే చెక్కుతున్నవాళ్ళం
అహంకారపు వంకరపెంకులను
ఆటబొమ్మలుగా అందిస్తున్నవాళ్ళం

ఇప్పుడు
మనిషి చెక్కిన విగ్రహాలు
ఆత్మవిస్మృతికి అలమటిస్తూ
ఆత్మరక్షణకై అంగలారుస్తున్నాయి
శిథిలావశేషాలలో స్వత్వాన్ని వెతుక్కొని
కాపాడుకోవటంలోనే కాలం గడుపుతున్నాయ్
మన లోకం కాబట్టి
మన సహాయమే అడుగుతున్నాయ్

అందుకే గదా
దివిటీలతో దినకరుణ్ణి చూపిస్తున్నాం
కవిత్వాలతో కాలాన్నీ కొలుస్తున్నాం
కొండలను పిండిచేసి
బాల్కనీలలో భరోసా నిస్తున్నాం
విశ్వసౌందర్యతత్వానికే
వినూత్నభాష్యాలు వ్రాస్తున్నాం.

అయినా

ఒక్క పెదవిపైనా

చిరునవ్వు కనిపించటం లేదు

ఒక్క నుదుటిపైనా

చిరుచెమటలు చిందువేయటం లేదు



## ఓడినా గెలుపే

ప్రకృతి గర్వంగా పలుకరించి
పులకరించగల మనిషిని
ఇంత నిజాయితీని యెదలో నింపుకొని
మనసారా మాటాడగల మనిషిని
సమాజానికి శూన్యమే అవసరమైతే
తానా తావు నింపగల మనిషిని
అన్ని ఆటల్లో ఓడిపోతున్నా
ఆటమానని మనిషిని
అన్ని అడుగులూ తడబడుతున్నా
నడకమానని మనిషిని

ఒక మంచిమనిషిని
సృష్టించి మాదిరిగా నిలపాలని
అనాదిగా దేవుడి నిరంతరప్రయత్నం

ఎన్నిసార్లు వచ్చాడో
విజయానికి ఈవలగట్టుదాకా
ముగింపు ముచ్చటగా కుదరక
మళ్ళీ మొదటినుండీ ప్రయత్నం
నాలుగు చుక్కలు నలబైగీతలుగా
ప్రయాణానికి పునరారంభం

ఆకాశానికి నిచ్చెనలు వేయించాడు
నీళ్ళలో నిలువీతలూ నేర్పించాడు
దిగంతాలకు వలసపోయినా
మట్టిమీద మమకారాన్ని మిగిల్చాడు
గుండెనిండా ధైర్యం కండనిండా శౌర్యం
పోతలుపోసి మరీ నింపాడు
రెండు కళ్ళతో ఒకే బొమ్మ చూపించాడు
రెండు మాటలూ ఒకే నాల్కతో పలికించాడు

అయినా
మనకు తృప్తీ లేదు
ఆయనకు అలసటా లేదు..

ఓటములు వెంటపడి తరుముతున్నా
ప్రయత్నం మానని పసి-డి-తనం ఆయనది
ఎన్ని ప్రయత్నాలు విఫలమైనా
మళ్ళీ ప్రయత్నించే
అచ్చమైన గెలుపు ఆయనది
అందుకే
ఆయన గెలుస్తూనే ఉన్నాడు
మనలను గెలిపిస్తూనే ఉన్నాడు..

ఆటమాత్రం ఆగకుండా అలా సాగుతూనే.........



# ఇప్పుడేమైందని....

మిత్రమా..
ఇప్పుడేమైందని
అనుక్షణమూ
అంతర్వేదనలూ ఆక్రోశాలూ
నిరాశలూ నిట్టూర్పులూ

మంచు కురుస్తూనే ఉంది
మల్లె విరుస్తూనే ఉంది
ఉషస్సు ఉద్వేగంగానే ఉంది
తమస్సు  తన్మయంగానే ఉంది

ఇంకా ఎందుకీ ఆందోళన ?

ఆశ చిగురిస్తూనే ఉంది
బాధ బరువెక్కుతూనే ఉంది
రోషం రగులుతూనే ఉంది
ఆవేశం హద్దు దాటుతూనే ఉంది

ఇంకా ఎందుకీ కలవరింతలు ?

చిలకటానికి రాక్షసులూ కావాలి
బుసల వైపునుండే ఉసిని పెంచాలి

పంచుకునే వేళలో మాత్రం
ప్రక్కనే కూర్చొని బలియై పోవాలి

ఆ పాటి స్వార్థం నేటికీ సజీవమే
అంతా అయిపోయినట్లు  అంగలార్చుట మెందుకు?

వెన్నుపోట్లు పొడుస్తూనే ఉన్నాం
నెత్తుటి కత్తులు తుడుస్తూనే ఉన్నాం
తడిగుడ్డలతో గొంతు కోస్తూనే ఉన్నాం
మడిబ్రతుకులలో మైల పెంచుతూనే ఉన్నాం

ఏం మారిపోయామని ఎలుగెత్తి ఏడ్వడాలు!

కాలం ఉరుకుతూనే ఉంది
గాలాలు మోస్తూనే ఉంది
నయాగరాలు పడుతూనే ఉన్నాయి
సయాటికాలు సాగుతూనే ఉన్నాయి
అందుకోవటమే లక్ష్యమైనవాళ్ళు
అందుకుంటూనే ఉన్నారు
వెనుకపడి లేవలేనివాళ్ళు
వ్రేలెత్తిచూపుతూనే ఉన్నారు

ఇంకా ఎందుకీ
ఎప్పటిదో ఏదో పోగొట్టుకున్నట్టు చింత?

ఇప్పటికీ కోతికి తోకంటేనే మక్కువ
ఇప్పటీకీ మనుషులకు తోకొక్కటే తక్కువ
శాఖాచంక్రమణాలు
జరుగుతూనే ఉన్నాయి
విరిగినకొమ్మలు
విషాదంగా చూస్తూనే ఉన్నాయి

ఇంకా ఎందుకు కల్లబొల్లి ఏడుపులు
ప్రపంచమంతా ప్రక్కదారిపట్టినట్టు

విధుల నతిక్రమిస్తూనే ఉన్నాం
నిషిద్ధాల నాదరిస్తూనే ఉన్నాం
ఆచరణను గూర్చి అడక్కపోతే
అన్ని సుభాషితాలకూ
కర్తృత్వం వహిస్తూనే ఉన్నాం

ఇంకా ఎందుకు
ఎవరో ఏదో చేయటం లేదని
ఆరోపణలూ ఆర్భాటాలూ...



## *వ్యత్యస్తపాదారవిందా!......*

నిన్ను నిటారుగా నిలపాలని
ఎవరెంత ప్రయత్నించినా
ఒంగిపోయిన వెన్నెముక
అడ్డుతగులుతూనే ఉంటుంది

చరిత్రను మలుపులు త్రిప్పిన
సూరీళ్ళ కథలు వల్లించినా
పట్టు వదలక గూడుకట్టే
సాలీళ్ళను కళ్ళెదుటే చూపినా
ఉక్రోషంతో ఊబిలో పడే
అస్తమయసూర్యుడే ఆదర్శ మంటావ్
గాయపడ్డ చందమామను చూపి
గతమంతా ఇంతే అంటావ్
బంజరుభూముల నెగాదిగా చూస్తూ
గుండెలను నెర్రెలు చేసుకుంటావ్

ఏరువాకకు ఏరువాకకు మధ్య
ఏడాదికన్నా వ్యవధి ఉండదు
సుఖానికీ సుఖానికీ మధ్యనే తప్ప
దుఃఖానికి మరెక్కడా చోటుండదు

ప్రయాణమార్గం ఒడుదుడుకైనా
గమ్యం మాత్రం ఆనందనందనం
గుండెపొరపై ఓటమి సంతకం చేస్తే
గుండెలోపల గెలుపుగూడుందని అర్థం..



## కాపురం - దాపురం

ఈదలేక తడబడే ఎఱ్ఱసూర్యుడి వెలుగులతో
ఒంటికి ఒంపులు దిద్దుకుంటూ
అలల మడతల అలవోక నాట్యాలతో
నదీనదాలు నాగరికతను ప్రసవిస్తే..
తరులతాగుల్మాలు తామరతంపరలై
ఎదుగుతున్న కొమ్మలై సాగుతున్న రెమ్మలై
తడిసి తనిసి చిగిర్చి పూచి ఫలించి
భరోసా ఇచ్చి పలుకరించి సంస్కృతిస్తే

నమ్మకమే నాగరీకమై నడయాడే మనిషి
నేలలో మృదుత్వమై నింగిలో నిర్మలత్వమై
ప్రకృతిలో తానొకడై తానే ఒక ప్రకృతియై...

ఈనాటి మన ముంగిటి ముగ్గులకు
ఆనాడే చుక్కలు పెట్టి అల్లిక లారంభించాడు
ఈనాటి మన కీర్తికిరీటాల ధగధగలకు
ఆనాడే ముడిసరుకును ముస్తాబు చేసిపెట్టాడు
అభ్యుదయమానవజీవనపతాకానికి
తొలిరంగు లానాడే తులకింపజేశాడు
వేగుచుక్కతో పాటు తానూ మేల్కొన్నాడు.

చుక్కెదురైనా సరే దుక్కి దున్ని జయించాడు.
అరణ్యాలలోని వరేణ్యతను ఆనాడే గుర్తించాడు.

వనాలు ఎంత ఎత్తు ఎదిగినా
మనుషులతో పాటే మేల్కొనేవి
చెట్టు పెద్దదైనా కాయలు చిన్నవి.
రాలే సమయంలో తేలికైపోయేవి.
కోతల వేళల్లో కుప్పలై వెలిసేవి.
నూర్చే సమయంలో రాసులై నిలిచేవి
నేల నచ్చితే దుంపలై పెరిగేవి
గాలి నచ్చితే కంకులై కులికేవి

పాడినుండీ పంటవైపు మనిషి పయనం
వాడి నుండీ వేడివైపు రుచుల గమనం
సుజనజనారణ్యంలో చూరునీటి చుక్కలతో
మరో నాగరికతను మారాకు తొడిగించాడు.

ఆకుచాటు పిందెను
అపార్థం చేసుకున్న నరుడు
"చలిచాటునో వేడిమాటునో
దొరికినవన్నీ దాచుకోవటమే జీవితం
నవ్విపోదురు గాక నాకేటి సిగ్గం"టూ
బడాయికి పోయి బజారు కెక్కాడు.... ★

# ఆఫలోదయకర్ములు

మిత్రమా
నువ్వు గొప్పవాడివి
నిన్ననే నాకర్థమైంది
నా గొప్పతనాన్ని నువ్వు గుర్తించిన
మరుక్షణమే అర్థమైంది

నువ్వు నిజంగా సహృదయుడివి
నా కవిత్వాన్ని
ఎవ్వరూ పొగడనంతగా
పొగిడినప్పుడే
నీ సహృదయతాసాంద్రత
నాకు హృదయదఘ్నంగా తెలిసింది

నువ్వు మహాకవివి
కొలతల కందని మహాకవివి
అక్షరాల లెక్కలూ పదాల కొలతలూ
మాత్రమే తెలిసి ఎగిసెగిసిపడే నేనూ
కవిత్వం వ్రాయగలననే ధైర్యాన్ని
నీ కవిత్వమే నాకు కలిగించింది

నువ్వు చాలా మంచివాడివి
నీ మంచితనాన్ని గుర్తించనందుకు
ఇరుగుపొరుగులతో ప్రతిక్షణం
నువ్వు చేసే పోరాటమే
నీ సత్యనిష్ఠకు సాక్షిపతాక

కోయిల మెచ్చితేనే వసంతం
మయూరం కులికితేనే నవాంబుదం
ఇవన్నీ పాత మాటలు
ప్రతిసారీ పాడటానికి
కోకిల కెక్కడ కుదురుతుంది?
ప్రతిమబ్బుముక్కనూ
స్వాగతించటానికి
నెమలి కెక్కడ పురి ఎక్కుతుంది?

అందుకే
నాకు నువ్వూ నీకు నేనూ
గీతామృతమూ అదేకదా
"పరస్పరం భావయన్తః.:



## పునర్జన్మ రెండుగా

నీ కనుపాప మీద
నా చూపులు లిఖిస్తున్న కావ్యాలకు
నీ మధురదరహాసాలే మహాభాష్యమై
నన్ను మహారాజును చేస్తాయి

ఏ జన్మలో శ్రీకారం చుట్టానో
నాకూ గుర్తులేదు
ఏ బంధం భాష్య మారంభించిందో
నీకూ తెలీదు

కనుపాప కదా అని
మరీ మృదువుగా నేను
మహాభాష్యం గదా అని
మరీ లోతుగా నువ్వు

నేనెప్పుడూ అడగను నిన్ను
నా కావ్య మెలా ఉందని
నువ్వెప్పుడూ అడగవు నన్ను
నా భాష్యం మూలవిధేయమేనా అని

నా కావ్యంలోని లాలిత్యం
నీ భాష్యంలో
సిగ్గుల మొలక అవుతుంది
నీ భాష్యంలోని పరిపూర్ణత్వం
మరో కావ్యానికి
నాకు మార్గదర్శక మవుతుంది.

నువ్వూ నేనూ
ఒకే జీవుడి రెండుముక్కలం
అందుకే
నా చూపులతో నేనేం వ్రాసినా
నీకు కరతలామలకమే అవుతుందది.
నువ్వేలా భాష్యాన్ని అనుగ్రహించినా
నాకు అంతకన్నా ఏముందనిపిస్తుంది..



# నలుగురూ ఒక్కటై....

ఒక బాట
త్రాచులా మెలికలు తిరుగుతూ
ఒక తోట
పచ్చదనం పరువాలు పంచుతూ
ఒక మేట
పిచ్చిమొక్కలతో మచ్చికచేస్తూ
ఒక నాట
నలుగురూ ఒక్కటై నడుస్తూ

లేయెండలో
పంటచేలలో నీళ్ళు మళ్ళగిస్తూ
మునిమాపులో
జొన్నకంకుల తుండు భుజాన మోస్తూ
కునుకు పట్టిన రేయి
కోటికలలకు రెక్కలు మొలిపిస్తూ
కళ్ళు మళ్ళబడకపోతే
తత్త్వగీతాలతో తలపులు కలబోస్తూ

చాలు వేసినా చాలు
మరో కారుతో మమతలు పెంచుకున్నట్లే
నాట్లు పడినా చాలు
నయాగరాలు కళ్ళముందు నడయాడినట్లే

కోతలూ కుప్పలు కుదిరితే చాలు
నట్టింట ధాన్యలక్ష్మి నాట్య మాడినట్లే
పరిగ ఏరుకున్నా చాలు
పసిడి పలుకులు తలవాకిట తారంగ మాడినట్లే

బాటప్రక్కన తుమ్మచెట్టు
పతివర్షలో మళ్ళీ పుడుతూనే ఉంటుంది
డొంకదారిలో నల్లమట్టి
ఎంతవాననైనా తనలోపలే ఇముడ్చుకుంటుంది
ఊరుమ్మడి చింతచెట్టు
ఎందరి బ్రతుకులకో జీవనాధారమవుతుంది
ఒక ఇంట రాజుకున్న నిప్పు
ఇంటింటా పొయిలో దూరి వంటలు వండిస్తుంది

నలుగురూ ఒక్కటై నడిస్తేనే...

ఒక క్షణం
బ్రతుకు దుర్భర మనిపించినా
మరో క్షణం
నందనవనంలా కనిపించేది

మనస్సంవేదనలన్నీ
మనుషులకు మాలిమి అయ్యేది
రంగూ రుచీ లేని ప్రకృతిప్రతిబింబాలకు
రసాల అనుభవాల రహదారులు పరిచగలిగేది ★

## తాను

క్రొత్తబాటలో తొలిమజిలీ
క్రొత్తతోటలో తొలిమధువు
క్రొత్తమాగాణంలో తొలితొలకరి
బరువెక్కిన గుండెకు తొలి ఊరట

నిదురించిన రేయికి తొలిఉషస్సు
ఆలపించిన పాటకు తొలిచరణం

మాగన్నుగా వాలిపోయిన మనస్సుకు
మరో మారు మమతల పందిరి
అర్థాంతరంగా ఆగిన కవితకు
మళ్ళీ పూచిన కలలసందడి

మరో మారు నా బ్రతుకుకు
దారిచూపిన దీపిక
మరో మారు ఆ సవితకు
ఒరుసుకు పోయిన వీచిక

బంగారు సంకెళ్ళతో
కాలాన్ని ఆపిన కళిక

బంధాల భావాలతో
మమతల కదిపిన వల్లిక

తావి పంచిపెట్టిందా
వేసవిలో విరిసిన మల్లిక
మంచులా కరిగిందా
రెండు హృదయాల కొకటే అల్లిక



## రెండూ ఒకటైతేనే

పడుకున్న పక్షిరెక్కల రంగుల్ని చూసి
పరవశానందంతో నువ్వు చిందు వేస్తుంటే
ఎగురుతున్న పక్షిరెక్కల ఏకాగ్రతను చూసి
అదేపనిగా ఆశ్చర్యపడుతుంటాను నేను

నురగలను తరుముతూ పరుగెత్తే
అలల పరువాల అలజడికి
ఆనందవిహాయసానివై
చేయూత నిస్తావు నువ్వు
భంగపడి వెనక్కు వెళ్తూ కూడా
మరో అలకు ఉప్పందించి
ద్విగుణీకృతశక్తితో  నైరాశ్యముక్తితో
ముందుకు దూకటం చూసి
మోకరిల్లుతాను నేను

ఎర్రకళ్ళ సూర్యుడిలో
ఏడంచుల కాంతివలయాలు నీ భావనం
నిద్రాణమైన జనజాగృతికై
నిరంతరం జరిగే తపస్సు నా దర్శనం

పొంగిపొర్లే చెరువులలో
ప్రకృతి విలయనాట్యం చేస్తుంటే
తాండవంలా భావిస్తూ
తలపోతలకు లోనవుతావు నువ్వు
మునిగిపోయే కాలనీలలో
మూర్తీభవించిన  కడగండ్లను చూస్తూ
మనుషుల అహంకారాలపై
ఆక్రోశిస్తాను నేను

నీ కన్నూ నా కన్నూ ఒక్కటై చూస్తే
విశ్వజీవనసూత్రసౌందర్యదర్శనం
నీ కన్ను అటూ నా కన్ను ఇటూ అయితే
అందానికీ చందానికీ మధ్య
అంతూ అవధీ లేని అగాధాల కలవరం



## *తథాస్తు దేవతలారా! తప్పుకోండి*

పిల్లలు
ఎవరిగదిలో వాళ్ళు
నవగ్రహప్రదక్షిణాల ఆటలతో
మధ్యమధ్యలో ఆగి
ఏ ట్యూబ్ లోనో  చూస్తూ
ప్రదక్షిణాల కొలతలు సరిచేసుకుంటూ

ఆహారసమస్య ఎవ్వరికీ ఉండదు
మైదాపిండి తిని తిని
ఆకలి మందగించిన జాతిలో
తాళఫలప్రమాణకబళచాతురులు
రామయమంత్రులు
వింతలూ విశేషాలలో
చరిత్రపుటల్లో మాత్రమే..

ఆ నెలలో నడిచిన
అడుగులమొత్తం కూడుకుంటూ
ఆ మాసపు బాదంపప్పుల
లెక్కలను సరిచూసుకుంటూ
కచేరీలో శ్రుతిపెట్టెలా
ఆధ్యాత్మికప్రవచనాల నాలకిస్తూ

ఎన్నినాళ్ళు విన్నా
ఆధ్యాత్మికత ఎక్కడుందో తెలీక
బుర్రగోక్కుంటూ
పాపం సీనియర్ సిటిజన్లు

నవదంపతులు విహారయాత్రగా
హిమాలయాల్లో హల్ చల్ చేస్తూ
ఊర్ధ్వరేతస్కులను కలిసి
ఆశీస్సులు తీసుకొని ధన్యులౌతారు
తిరుగు ప్రయాణంలో
సొంతవిమానంలో
ఎవరికాబిన్ లో వాళ్ళుండి
వీడియో సంభాషణలతో
జీవితాన్ని ప్లాన్ చేసుకుంటుంటారు

భౌతికంగా మానసికంగా
మనుషులందరూ మరుగుజ్జులై
కాళ్ళకు విశ్రాంతినిచ్చి
వ్రేళ్ళతోనో గోళ్ళతోనో
పనులు ముగిస్తారు
మన మాటలను యంత్రాలే లిఖిస్తాయి
అవసరాన్ని బట్టి మనం
భావాలు మార్చుకుంటే చాలు

ఏ ఆన్లైన్ సైట్ చూసినా
టెంకాయలూ,
తాయెత్తులూ బంపర్ సేల్స్
కాయకు ఎన్ని పీచులుంటే
ఏం ఫలితమో చెప్పే
మహాజ్ఞానులతో కన్సల్టేషన్ ఫ్రీ
మనకోసం పూజలు చేసేందుకూ
మనతరఫున ప్రసాదం తినేందుకూ
మనుషులను వాళ్ళే ఏర్పాటుచేస్తారు
ఆన్లైన్లో ధనం సమర్పిస్తే చాలు..

నిన్నటి దాకా ధైర్యంగానే బ్రతికా
నిశ్చలంగా ఆటుపోట్లు తట్టుకుంటూ
ఇప్పుడిప్పుడే భయపడుతున్నా
భవిష్యజ్జాతిని తలచుకుంటూ...



## *దేవుడా! నిన్ను నువ్వే కాపాడుకో!*

నన్ను కాపాడండి
నా కుటుంబాన్ని కాపాడండి
నా పరివారాన్ని కాపాడండి
నా సమాజాన్ని కాపాడండి
నేను నమ్మే
నా పరమాత్మను కాపాడండి

ఆలోచించటం నేరమట
ఆలోచించటం పాపమట
ఆలోచించమనటం ద్రోహమట
ఆలోచించేవాడు దగ్గరుంటే
ఇంటికి అరిష్టమట
కుటుంబానికి అరిష్టమట
సమాజానికి అరిష్టమట

ఎంతమందిని పొట్టన పెట్టుకున్నామో
ఈ వికారమనఃప్రవృత్తితో

వాళ్ళు శాసించినట్లే ఆలోచించాలట
వాళ్ళ నంగిమాటలనే నంజుకోవాలట

వాళ్ళ ప్రచారాలతోనే పునీతం కావాలట
వాళ్ళ ప్రసారాలకే తలవాల్చి మొక్కాలట

ఘరానా మాంత్రికులు
కుహనా తాంత్రికులు
అనుభవం లేని ప్రవక్తలు
ఆచరణలేని ప్రసంగీకులు
కొత్త మంత్రాలతో తంత్రాలతో
కొత్త యాగాలతో భోగాలతో
నన్ను భయపెడుతున్నారు
నా ఆలోచనను భయపెడుతున్నారు.
నా చుట్టూ ఉన్న ప్రతికణాన్నీ
నన్నల్లుకొని ఉన్న ప్రతిక్షణాన్నీ
భయంలో నానపెట్టి
పిసికి పిప్పి చేయాలనుకుంటున్నారు

ధైర్యాన్నివ్వవలసిన తత్త్వశాస్త్రం
దీనులను సృష్టిస్తోంది
బలంగా బ్రతకవలసిన జాతిని
బదనాం చేసి దుర్బలులను చేస్తోంది

ప్రారబ్ధాల పచ్చిలెక్కలతో
ప్రవర్తనలను శాసించే ప్రయత్నం

సాకారనిరాకార చిక్కుముళ్ళతోనే
ప్రసాదాలనూ శాసించే సాహసం
ఏ వైతమో తెలీకుండానే
కలగాపులగం చేసి కిచిడీ వండే ధైర్యం

నాకు నిఝంగా భయమేస్తోంది.

పేరు మార్చాలా?
స్పెల్లింగ్ మార్చాలా?
బట్టల రంగు మార్చాలా?
జుట్టు మార్చాలా?
కట్టూ బొట్టూ మార్చాలా?
ఇల్లు మార్చాలా?
వాకిలి మార్చాలా?
ఇంటి ఇటుకల సంఖ్య సరో బేసో
ఇప్పుడు లెక్కబెట్టలేనే!
మైపూతలు మార్చాలా?
రుద్రాక్షల ముఖాలు మార్చాలా?
శరణాగతిని మార్చాలా?
పట్టే పాదాలు మార్చాలా?
కట్టే చందాలు మార్చాలా?

చానళ్ళు మార్చినంత తేలికా
జీవితాలు మార్చటం?
కావళ్ళు మోసినంత తేలికా
కన్నీళ్ళు మోయటం?

నన్ను భయపెట్టకండి
మీతో కలిసి బ్రతకాలంటే
మీలాగే ఉండాలా?

గులాబీల తోటలో
గడ్డి కలుపుమొక్కే..
పీకేస్తున్నాం....
గరికను పెంచే తోటలో
గులాబీ కూడా కలుపు మొక్కే పీకేద్దామా?



## నేను నాలాగే....

నిన్న గొప్పదే మన భావనలో
కానీ మనది కాదు
అది చరిత్ర సొంతం

రేపు గొప్పదే మన ఊహలలో
కానీ మనది కాకపోవచ్చు
రేపటికి మనమే లేకపోవచ్చు

ఈ రోజు అన్నింటికన్న గొప్పది..
ఇది మనతో కదులుతుంది
మన అనుభవంలో లీన మౌతుంది
మన స్పందనలతో స్పందిస్తుంది
మన ఆచరణలో ఆదర్శ మవుతుంది.

వంతెన మధ్యలో నడుస్తూ
అంచుల ఆలోచన అవసరమా?

కానీ తన భయం తనది
ఒకరోజు ఒట్టేయించింది
నువ్వు శ్రీకృష్ణుడివి కాకూడదంటూ..
తల ఊపాను అలాగే అంటూ
నాల్నాళ్ళకే మారిపోయింది

అయిదో రోజు మాట ఇమ్మంది
శ్రీరామచంద్రుడివి కాకూడదంటూ..
అలాగే అన్నాను

హరిశ్చంద్రుడి వవుతావా?
నిద్రలేపుతూనే అడిగింది మరోరోజు
"ఏ విషయంలో?"
అయోమయంగా నిష్క్రమించింది..
నాలుగు రోజులు గడిచాయి
మూడు ప్రవచనాలు విని వచ్చింది.
"ధర్మరాజు కూడా కాకూడదు"
దిగాలుగా అడిగింది.
అంత ధైర్యం లేదన్నాను

ఒకరోజు హఠాత్తుగా..
"యయాతి తెలుసా మీకు?"
"ఆయనకథ విన్నా.. ఎందు కిప్పుడు?"
ఏం లేదు.. అడగాలనిపించింది.
నాకూ ఏదో అర్థమవుతున్నట్టుంది
ధైర్యం చెప్తూ అన్నా
నేను నాలాగే ఇప్పటిలాగే ఇలాగే
బ్రతుకుతా.. భయపడవద్దు

మళ్ళీ అడిగింది
"అయితే గొప్పవారు కారా?'......



# పేరు పెట్టండి ..చాలు

నాకు
స్వేచ్ఛను గురించి చెప్పకండి
పోరాటాన్ని నూరిపోయకండి

వేకువగాలి
చల్లగా తట్టి లేపుతున్నా
పులకరించాలన్నా భయం
సూర్యకిరణాలు కనురెప్పలను తాకితే
కన్ను మూసుకోవాలన్నా భయమే

అసంకల్పిత ప్రతీకారచర్యలకు కూడా
అణచివేత నా నెత్తురులో నే ఉంది

తుమ్మెద స్వేచ్ఛగా ఎగురుతుంది
తూనీగ ఆనందంగా తిరుగుతుంది
సీతాకోకచిలుక రెపరెపలై కులుకుతుంది
నువ్వూ అంతే గదా.. అనకండి మీరు
నా రెక్కలు విరిగి తరాలు గడిచిపోయాయి
కాయగాచిన భుజాలు పండిపోయాయి కూడా

గూటిలోని దీపమే నాకెరుక
దావానలాన్ని గురించి నాకు చెప్పకండి
ఆ హోరు నేను ఓపలేను
చిదుగులన్నీ ఒక్కటై చితిని పేరుస్తాయేమో

పుడిసెడు పాలతో బ్రతుకు వెళ్ళబుచ్చుతా
పాలకడలి గురించి చెప్పకండి
ఆ మథనాన్ని నేను భరించలేను
మీగడతరకలు గాయం చేస్తాయేమో
వెన్నముద్దలు వెన్ను విరుస్తాయేమో

వీరగాథలు నాకు వివరించకండి
విధి ఎప్పుడూ వక్రీస్తూనే ఉంటుంది
కత్తిమొన నన్ను గ్రుచ్చనక్కరలేదు
పిడి తగిలినా చాలు యాదృచ్ఛికంగా
పిడికెడు గుండా ఆగుతుంది
నా నెత్తురు చల్లబడి చాలా కాలమైంది
నన్ను ఉరికించే ప్రయత్నం మానండి

తరతరాలుగా నేను
వీడికో వాడికో బానిసనే
బానిసల అడుగుజాడల్లోనే
పాదాలు కదుపుతూ నడిచినవాణ్ణి

భావాలు ఎగిసెగిసి పడుతున్నా
లుంగలు చుట్టి అంగిట్లోనే దాచినవాణ్ణి

విశ్వకుసుమవికాసంలో
నా తేజస్సు కొరవడితే మాత్రం ఏం?
కాలం కొొలతల్లో
రెండుబిందువుల మధ్య
నా పేరూ ఉంటుంది
జననమరణపట్టికల్లో....



# కవి పరిచయం

## డా. సూరం శ్రీనివాసులు

| | | |
|---|---|---|
| జననం | : | 03-06-1951, నెల్లూరు |
| తల్లిదండ్రులు | : | కడయింటి శేషమ్మ, సూరం హనుమంతయ్య |
| విద్యాభ్యాసం | : | 20 సం॥ వయస్సు వరకు నెల్లూరులోనే |
| ప్రాథమిక విద్య | : | 1-3 తరగతి ఎయిడెడ్ ఎలిమెంటరీ స్కూల్, అత్తితోట అగ్రహారం<br>4-5 తరగతి ఎయిడెడ్ ఎలిమెంటరీ స్కూల్, ఉస్మాన్ సాహెబ్ పేట |
| ఉన్నత విద్య | : | 6-8 తరగతి - వి.ఆర్. హైస్కూల్<br>9-ఎస్.ఎస్.ఎల్.సి. - వేద సంస్కృత పాఠశాల - 1967, మూలపేట |
| కళాశాల విద్య | : | సాహిత్య శిరోమణి, వేద సంస్కృత పాఠశాల – 1967,<br>మూలపేట (శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రథమస్థానం) |
| ప్రైవేటుగా | : | పి.ఒ.ఎల్. 1975, ఆంధ్ర విశ్వకళా పరిషత్, వాల్తేరు.<br>భాషా ప్రవీణ 1976, ఆంధ్ర విశ్వకళా పరిషత్, వాల్తేరు.<br>ఎమ్.ఎ. (సంస్కృతం) 1977, ఆంధ్ర విశ్వకళా పరిషత్, వాల్తేరు.<br>ఎమ్.ఎ. తెలుగు 1978, ఆంధ్ర విశ్వకళా పరిషత్, వాల్తేరు.<br>వాల్తేరు. పి. హెచ్.డి. 1986, ఆంధ్ర విశ్వకళా పరిషత్ వాల్తేరు. |
| ఉద్యోగం | : | 1971 - 1972, ఎన్.వి.ఎస్.ఓ.ఎన్. స్కూల్,<br>చేకూరపాడు, ప్రకాశం జిల్లా. |
| లెక్చరర్ | : | 1972 - 1976, ఓరియంటల్ కాలేజ్, ఏలూరు &<br>ఓరియంటల్ కాలేజీ, చిననింద్రకొలను.<br>1976 - 1080, ఓరియంటల్ కాలేజీ, పొన్నూరు. |
| ప్రిన్సిపల్ | : | 1980-1990, ఓరియంటల్ కాలేజీ, తాడికొండ.<br>1990-2009, ఓరియంటల్ కాలేజీ, తిమ్మసముద్రం |
| పార్ట్ టైమ్ లెక్చరర్ | : | ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం (1 సంవత్సరం) |

Visiting Fellow : రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠం, తిరుపతి. (2008-09)

Adjudicator : For Several Dessertations Submitted for Ph.D

పురస్కారాలు : - ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ ఉత్తమ గ్రంథం బహుమతి - 1979 'సంస్కృత భాణ సాహిత్య' గ్రంథం
- ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంచే ఉత్తమాధ్యాపక బహుమతి-1981
- తెలుగు వెలుగులు - శ్రీనాథపీఠం-1987
- పుష్పకిరీట సన్మానం, చెన్నై
- ఉగాది సాహితీ పురస్కారం, లలితకళా పరిషత్, చీరాల-2001
- బహుముఖ ప్రజ్ఞ పురస్కారం, సహజ సాహితి, చీరాల-2009
- సి.పి.బ్రౌన్ సాహితీసేవాపురస్కారం, బెంగుళూరు - 2020 నవంబర్
- 1970 విద్యార్థి దశ నుండి వివిధ ప్రాంతాలలో అవధాన సభలలో సన్మానాలు, బిరుద ప్రదానాలు.

**వృత్తిపరంగా నిర్వహించిన బాధ్యతలు**

1. Member, Academic Council, Acharya Nagarjuna University.
2. Member, Academic Senate, Acharya Nagarjuna University.
3. Member, Board of Studies in Oriental Languages, Aharya Nagarjuna University.
4. Adhoc PG Board of Studies (Sanskrit), Acharya Nagarjuna University.
5. Person, Refresher Courses
6. P.R.O., Oriental College, Resource Teachers Association (AP)

## ప్రచురణలు

1. సౌమనస్యము (ఖండకావ్యం - పద్యం) - 1979
2. సున్నితపుత్రాసు (వచనకవితాసంకలనం) - 2002
3. సంస్కృతభాణసాహిత్యము (విమర్శ) (ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహూమతి 1979)
4. సంస్కృతప్రహసనసాహిత్యం (విమర్శ) - 1986
5. Hasya and Prahasana : A Critical Study (Ph.D..thesis) - 1989
6. మత్తవిలాసప్రహసనము - తెలుగు అనువాదం - 1974

7. పూజాకుసుమమ్. (రేడియో నాటకం..సంస్కృతం) - 1987
8. కరావలంబమ్. ( " " ) - 1985
9. ధూర్తానుభవభాణః (సంస్కృతం)
10. గురువరరంజనభాణః ( " )
11. కవిజనమండనభాణః ( " )
12. నటసమాగమభాణః ( " )
13. నికష( విశ్వధర్మవాణ మాసపత్రిక సంపాదకుడుగా వ్రాసిన
సంపాదకీయాల సంకలనం) - 2009
14. రుక్మిణీశవిజయమ్ (సంస్కృతమహాకావ్యానికి విస్తృతంగా తెలుగు వ్యాఖ్య)
15. భవానీ భారతి (అరవిందుని సంస్కృతకావ్యానికి తెలుగు వ్యాఖ్య) - 2019
16. దశావతారస్తోత్రమ్ (వాదిరాజతీర్థరు రచనకు తెలుగువ్యాఖ్య) - 2019
17. శివానందలహరికి జ్యోతిష్మతీ వ్యాఖ్య
( సంస్కృతంలోనే - వ్యాకరణవిశేషప్రస్తావనతో) - 2020
18. రాధాషోడశ నామస్తోత్రం (అర్థతాత్పర్యాలు) - 2020
19. కుమారసంభవమ్(కాళిదాసరచితమ్) (అష్టమసర్గ - తెలుగులో వ్యాఖ్య) - 2021
20. ధాతృప్రశ్నః అథవా వేదాన్తమణ్డనమ్ - 2021
21. స్థావరజంగమం (వచనకవితాగీత) - 2021
22. రసవిద్య (కవనశిల్ప సమీక్ష - పద్యగ్రంథం) - 2022
23. భారతనిరుక్తి - నన్నయరుచిరార్థసూక్తి - 1983
24. భారతనిరుక్తి - తిక్కన సరసోక్తి
25. భారతనిరుక్తి - ఎఱ్ఱన ధర్మోక్తి
26. జనహిత వ్యాఖ్య (ఆంధ్రమహాభారతము - విరాటపర్వము) - 1989
27. జనహితవ్యాఖ్య (ఆంధ్రమహాభారతము - ఉద్యోగపర్వము) - 2000
28. జనహితవ్యాఖ్య..(నిర్వచనోత్తరరామాయణము - తిక్కన) - 2005
29. వ్యాసమహాభారతం - తెలుగువచనం - 2010
(వ్యాసభారతానికియథాతథానువాదం) 20 సంపుటాలు(6000 పుటలు)
30. మహాభారతము – తెలుగు (మూలం..అనువాదం..విశేషాంశాలు..గీతాప్రెస్..గోరఖ్
పూర్ ప్రచురణ) A4 సైజులో. 7.సంపుటాలు..7250 పుటలు - 2018
31. శ్రీమహాభారతము(సంస్కృతం) విరాటపర్వము
(జనహితవ్యాఖ్య - తెలుగులో - గీతాప్రెస్,గోరఖ్‌పూర్ ప్రచురణ) 2005

(23 - 31 గ్రంథాలకు సహరచయిత డా|| తిప్పాభట్ల రామకృష్ణమూర్తి)

**ఇతరాలు:**

1973 నుండి ఆకాశవాణి ద్వారా సంస్కృత పాఠాలు, సంస్కృత ప్రసంగాలు కథలు, ఏక పాత్రలు, సూక్తి సుధ, సద్వాణి, తెలుగు సాహిత్య ప్రసంగాలు -

1973 నుండి జాగృతి, భారతి, నాట్యకళ, ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, రచన, సమాలోచనమ్, గైర్వాణి, సుధర్మా, ఆత్మజ్యోతి, సంవిత్, సంస్కృత సమ్మేళనమ్ మొదలైన పత్రికలలో వచన కవితలు, విమర్శ వ్యాసాలు, శ్లోకాలు, నాటికలు ముద్రితాలు, బొమ్మలకొలువు - అసంపూర్ణ నవల - విద్యాజ్యోతిలో సీరియల్

1991 నుండి 'విశ్వ ధర్మ వాణి' పత్రికా సంపాదకత్వం

**కుటుంబ వివరాలు:**

శ్రీమతి : సులోచన

కుమార్తెలు : 1. మాధవి, BE (Hons) M.S
అల్లుడు : కావూరి శ్యామ్ సుందర్
మనవడు : శ్రీహర్ష
మనవరాలు : గాయత్రి

2. డా|| సుషమ., M.B.B.S.,D.O
అల్లుడు : డా|| ప్రవీణ్ కుమార్
మనవరాలు : వాహిని

**అభీష్ట విషయాలు** : 1. అధ్యయనం, అధ్యాపనం
2. ఆధ్యాత్మిక, అది భౌతిక జీవితాల మధ్య సమన్వయాన్ని సాధించేందుకు అనుగుణంగా విశ్లేషణాత్మక పరిశీలన
3. ఆచరణ ప్రాధాన్యం